# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీశ్రీశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
జమీందారు, ఉయ్యూరు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

కాకినాడ

అధ్యక్షులు

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అభినవభోజ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
8. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
9. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు
10. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
11. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు

# వి ష య సూ చి క

కీలక — జ్యేష్ఠాషాఢములు

సంపుటము ౫౭ — సంచిక ౨

# తారకాలింగస్తవము

కీ॥ శే॥ "కవికంఠీరవ" డా॥ యం. కె. స్వామి, యం. డి. (ఎ)

శ్రీరమారమణీమణీధవసేవితాంఘ్రిసరోజ! శ్రీ
శారదాస్తవనీయశంకర! సారసాసన శాసనా!
శారికాశుకకోకిలాముఖ సైన్యనాథవిభంజనా!
తారకాపథకేశ! శ్రీకర! తారకాలింగేశ్వరా!

వందనంబు మహేశ! శంకర! వాసుదేవ! మహాప్రభో!
వందనంబు పురాణపూరుష! వారిజాక్షమనః ప్రియా!
వందనంబు శివాధవా! భవ! వందితామరబృంద! మ
ద్వందనంబు గ్రహింపవే! దయ! తారకాలింగేశ్వరా!

సీ. శ్రీమదుమారమణీమణీ రమణీయ
భుజపంజరవిహంగ భూశతాంగ!
సంతతాశ్రితభక్త చర్మచక్షుః ప్రియ
కరుసద్దివ్యలింగస్వరూపి!
దర్పకావేశచే తస్కృతామర సాస
న సగర్వాహృతవిహాయసవిహార!
బాలసరస్వతీ భయకంపితార్తాని
నాదవారణకార ణావతార!
భక్తమందార! పరమపావనపదార
వింద! మందాకినీజటా విమలజూట!
పాహి మాం పాహి మాం పాహి పాహి పాహి
మంగళాకరతారకా! మంజులింగ!



# అభిజ్ఞానశాకున్తలమున ఔచిత్యపాలనము

—శ్రీ బయ్యా వెంకటసూర్యనారాయణ, M. A.

'అస్మి న్నతివిచిత్రకవిపరంపరావాహిని సంసారే ద్విత్రాః పంచషా వా మహాకవీయ ఇతి గణ్య న్తే'- అని ధ్వనికారునిచే వ్రేళ్లపై లెక్కించి కవులుగా పరిగణింపబడిన కొలదిమందిలో కవికాళిదాసు ఒకడు. దృశ్యశ్రవ్యకావ్యముల రెంటిని తుల్యప్రతిభతో రచియించిన కవిశిరోమణి యీతఁడు. ఈతని రఘువంశకుమారసంభవ మేఘసందేశ ములును శ్రవ్యకావ్యములును, మాలవికాగ్నిమిత్ర విక్రమోర్వశీయాభి జ్ఞానశాకున్తలము లను దృశ్యకావ్యములును సాహిత్యప్రియులకు రస సింధువులు. విశ్వసాహిత్యము క్షీరసాగరమైనచో నభిజ్ఞానశాకున్త లము లిం దుద్భవించిన యమృతకలశము. కావున నే 'కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకున్తలా' అనునానుడి పొసగినది.

ఒకవిధముగ సృష్టిలో కేవలము అసుందరము అనదగిన వస్తువే లేదని చెప్పవచ్చును. సౌందర్యాధిదేవత తన విహారయాత్రలో ప్రతి వస్తువునందును కొలదిగనో గొప్పగనో, గడియో క్షణమో కాలూ ననిదే ముందుకు సాగిపోదట. అట్లయ్యు నాయా వస్తువులందలి సౌంద ర్యము అస్థిరముగ, అసంపూర్ణముగ మాత్రమే భాసించుచున్నది. వాస్తవజగత్తులో నుపలబ్ధమగు నిట్టి యశాశ్వత పాక్షికసౌందర్యము యొక్క శాశ్వత సంపూర్ణ రూపము ననుభవయోగ్యము సేయ నట్టిదే కళ. కళ యన్న పరుసవేదివంటిది. ఏది తాకినను సువర్ణమే.

'రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచమ్
ఉగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు,
యద్వాప్యవస్తు కవిభావిత భావ్యమానం
తన్నాస్తి య న్నరసభావము పైతిలోకే.

అని దశరూపకకారుని ఉక్తి. అతిసాధారణమగు వస్తువును గైకొని ప్రజాశాలురగు కవులు అందు తమ భావనాబలముచే దివ్యసుందర రూపమును భాసింపజేయగలరు. వారిప్రజ్ఞ అభినవ గుప్తుడన్నట్లు అపూర్వవస్తు నిర్మాణక్షమము, భామహుడన్నట్లు నవనవోన్మేష శాలిని. ప్రతిభయను సాధనముతో భావనాపథమున విహరించుకవికి ఔచిత్యము కరదీపికవంటిది. ఔచిత్యము కొరవడిన కవిప్రజ్ఞయు, భావనాపటిమయు శాశ్వతసంపూర్ణ సౌందర్యమును నెలయింపజాలవు. కావుననే—

'అనౌచిత్యాదృతే నాన్యద్రస భంగస్య కారణమ్'—

అనినాడు ఆనందవర్ధనుడు. 'సత్యం శివం సుందరమ్' అను నుక్తికిదియే భావము. సౌందర్య సంపూర్ణత్వమునకు సత్యత్వ శివత్వములు అవశ్యానుగామి ధర్మములు. ఔచిత్యము వీనిలో నంతర్వ్యాపిని. ఎచట సత్యత్వ శివత్వములు గలవో అచట ననౌచిత్యమునకు తావెక్కడిది? కాగా ఔచిత్యపాలనా సిద్ధములగు సత్యత్వ శివత్వములు సౌందర్యమునకు శాశ్వతత్వమును, సంపూర్ణత్వమును చేకూర్చునని భావము. కావుననే కావ్యాత్మను నిరూపింప యత్నించిన ప్రాచీనాలంకారికులలో క్షేమేంద్రుడు డీయౌచిత్యమునే కావ్యజీవితమనినాడు.

"ఔచిత్యస్య చమత్కార కారిణ శ్చారుచర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా
కావ్యస్యాల మలంకారైః కిం మిథ్యాగుణితైర్గుణైః
యస్య జీవిత మౌచిత్యం విచిన్త్యాపి న దృశ్యతే
అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణా స్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్."

మహాకవి కాళిదాసు కృతులలో ఔచిత్యపాలనాధర్మము నన్వేషింపబూనుట మధ్యందినమార్తాండు నన్వేషించుట వంటిది. అట్లుకానిచో

ననంతమగు కావ్యజగత్తులో విహారముసేయుటకై కవుల కానంద వర్ధను డిచ్చిన విమానములో కాళిదాసునకు స్థలము లభించియుండెడిది కాదు. (కాలవ్యత్యాసము అప్రసక్తము). అది పుష్పకము కాదు. ఇరు వురు ముగ్గురే అందుచోటు సంపాదింపగలరు. అతికష్టముపై నైదారు గురు వరకు వీలగునట. అక్కడితో 'బుకింగు' ఆపివేసినారు ఆనంద వర్ధనులు. కావున కాళిదాసు రచనలలో నడుగడుగున నభివ్యక్తమగు నౌచిత్యపాలనా ప్రాశస్త్యమును గుర్తించుచు ఆతని సర్వతోముఖప్రతి భకు కేల్మోడ్చి, విస్మయానందాప్లావిత హృదయుడగుటయే సాహితీ పథికుని లక్ష్యము. సాహిత్యమునకు తలమానికము నాటకమని యెరిం గిన సహృదయులకు విశ్వసాహిత్యమునకు తలమానిక మేదను ప్రశ్న వెలసిననాడు అది కాళిదాస విరచితమగు శాకున్తలమని గుర్తుకు తేన క్కరలేదు. అది గుర్తుండనివాడు 'న భూతో న భవిష్యతి'. కాగా అభిజ్ఞానశాకున్తలమును నామమునకు సార్థక్య మినుమడించినదని చెప్ప వలసియుండును.

ప్రకరణోచిత సన్నివేశముల కల్పనము, కథాపాత్రాదుల యుదాత్తత కనురూపమగు వర్ణనలు, సంభాషణలు, అలంకారములు మున్నగున వెన్నియో శాకున్తలమున నడుగడుగున గోచరించుచునే యున్నవి. అన్నిటినిమించినది ఉదాత్తప్రణయ చిత్రణము. ఇట శృంగార రసచిత్రణమున కాళిదాసుచూపిన సంయమము, ఉదాత్తత, ఔచితి శ్లాఘాపాత్రములు. ఇచట ప్రధానముగ నీ నాటకమందలి ప్రణయ చిత్రణమున నభివ్యక్తమగు నౌచితిని పరిశీలించుటయే లక్ష్యము.

ఇందు నాయికానాయకులు శకున్తలా దుష్యంతులు. ఒకరాజ ర్షికి కన్నబిడ్డయై, వేరొక బ్రహ్మర్షికి పెంపుడుబిడ్డయైనది శకున్తల ప్రజాజీవితమునకు మార్గదర్శకులగు మహారాజులలో ఖ్యాతి గడించిన వాడు దుష్యంతుడు. ఇట్టి నాయికానాయకుల ప్రథమ సమాగమము

నకు రంగస్థలము పవిత్రమగు కణ్వాశ్రమము. ఔచిత్యము, పారిశుద్ధ్యము అడుగడుగున అణువణువున పరివ్యాప్తమైన పవిత్రస్థానమిది. ఉదాత్తమూర్తులగు నీ నాయికానాయకులకు ఇట్టి పునీతస్థానమున నుదయించిన యనురాగమునకు పరిణతి తదనురూపముగనే చిత్రింపవలసియుండుట యుక్తమే కదా!

మృగయావినోదార్థమై బయలు వెడలిన దుష్యన్తుడు 'నచేదన్యకార్యాతిపాతః తత్ప్రవిశ్య గృహ్యతామాతిథేయః సత్కారః' అను వైఖానసుల యాహ్వానముపైననే కణ్వాశ్రమమున బ్రవేశించినాడు. కణ్వుని యనుపస్థితిగూర్చి యెరింగించుచు వారు 'ఇదానీమేవ దుహితరం శకున్తలా మతిథిసత్కారాయ నియుజ్య దైవమస్యాః ప్రతికూలం శమయితుం సోమతీర్థం గతః' అనుటలో త్రికాలవేది యగు కణ్వర్షి శకున్తల నతిథిసత్కారమునకు తానే నియోగింప, నతిథిగా దుష్యన్తుడాహ్వానింపబడినాడని ధ్వనితము. కావుననే శకున్తలా దుష్యన్తుల సమావేశానన్తరము వచ్చిన కణ్వుడు 'వత్సే! సుశిష్యపరిదత్తావిద్యేవ అశోచనీయా సంవృత్తా' అని కూతు నభినందించినాడు. మునికన్నియ యగు నాయిక ప్రవర్తనమునగాని, పరిపాలకుడును, ప్రతిష్ఠావంతుడును నగు నాయకుని వర్తనమునగాని యౌచిత్యము సడలకుండ గాపాడు చిత్రణమిది. శాన్తమగు నాశ్రమపదమునకు, దనకట బాహుస్పందన మగుటకును పొత్తులేదని క్షణకాలము శంకించియు 'భవితవ్యానాం ద్వారాణి భవన్తి సర్వత్ర' యని సమన్వయించుకొనెనే గాని తన ప్రవర్తన గూర్చినశంక యిసుమంతయు నాతనికి గలుగలేదు. ఈతనికి తన ప్రవర్తనపై యింతటి యాత్మవిశ్వాస మెక్కడిది? ఎక్కడిదేమున్నది! 'సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణమన్తఃకరణ ప్రవృత్తయః' అని తీర్పు చెప్పబడియే యున్నది. తమ ప్రవర్తన యెట్టిదని కాళిదాసు చిత్రించిన పాత్రలుగాని, తాను చిత్రించిన

పాత్రల ప్రవర్తన యెట్లున్నదని కాళిదాసుగాని, లేదా యెట్టిపాత్రల జిత్రించుచున్నాడని కాళిదాసునుగూర్చి సహృదయులుగాని హేతువులను, యుక్తులను వెదకి సమర్థించుకొన బనిలేదు. తత్పాత్ర చిత్రణ విధానము స్వతఃప్రమాణము.

శకున్తలా దుష్యన్తుల ప్రథమ సమావేశమున కవి చూపిన చాతుర్యములో భావముల సౌకుమార్యము, ఘటనల స్వాభావికత, పాత్రల ధర్మానుయాయిత మున్నగు గుణ విశేషములెన్నియో నాటకమునకు మెరుగులు తీర్చి దిద్దినవి. విస్రంభముగ సఖీసమేతయై వృక్షలతాదులకు జలసేచనం బొనరించుచున్న నాయికను గాంచి నాగరికుడే నరపతి శృంగారరసా ప్లావితాంతరంగుడై నాడనుట సహజమే కాని, నాయకుని చూడగనే మునికన్యయగు శకున్తలకిట్టి భావము గల్గిన దన్నచో నది యాశ్రమోచితము గానేరదు. మునికన్నియల జీవితమునకు సహజమును కాదు. సఖులు లతానికుంజములకు నీరువోయుచు నొనర్చిన ప్రసంగములు శకున్తలను తరువాతి రంగమునకు సంసిద్ధము సేయుటలో నేర్పు, నైసర్గికత, రామణీయకము మున్నగు లక్షణము లెన్నియో గమనింపగలము. కేసరవృక్షమునకు శకున్తల నీరువోయు చుండ- ఆమెను క్షణకాలము ఆ చెట్టుప్రక్కనే నిలువుమనియు, నట్లు చేసినచో నప్పుడా కేసరవృక్షము లతాసనీతమైనట్లు శోభిల్లు ననియు ప్రియంవద ప్రియభాషణము. ఇంతలో సహకారమునకు స్వయంవరవధువై, వనజ్యోత్స్నయని శకున్తలచే పిలువబడుచున్న నవమాలికను గూర్చి యనసూయ ముచ్చటించినది. 'రమణీయమగుకాలమున నీ లతాపాదపమిథునమునకు పొత్తుకుదిరినది; నవకుసుమ యౌవన వనజ్యోత్స్న స్నిగ్ధపల్లవతచే నుపభోగక్షమము సహకారము' - అన్నది శకున్తల. వనజ్యోత్స్నను కుతూహలపూర్వకముగు నా ప్యాయములో దిలకించుచున్న శకున్తలను నిర్దేశించి ప్రియంవద ఆ సన్నివేశమును వ్యాఖ్యా

నించినది.అనురూపమగుపాదపముతోఁగూడినవనజ్యోత్స్నవలె తానును అనురూపుడగు వరుని పొందుదునా యని యువ్విళ్లూరుటయే ఆచూపున కంతరార్థమని ఆ వ్యాఖ్యానము. వృక్షలతాదిపరముగ సఖుల ప్రసంగ ములతో నాశ్రమవాసినియు, మునికన్యయు నగుశకున్తల యంతరంగ మును శృంగార భావభరితముగ జేయుటలోని యౌచిత్యము నిరుప మానము.

ఇక నాయకుని సంగతి. పాదపాంతర్హితుడైన యాతడు సఖీ సహితయైన శకున్తలను జూచి, యపురూపమగు నామె రూపసంప దకు ముగ్ధుడై తత్ప్రశంసాసూచకముగ దనలో నొండురెండు మాట లను గొనును. నిర్లిప్తతతో నట్టి లోకోత్తరసౌందర్యమును ప్రశం సించుట లెస్సగనేయున్నది. కాని ఆతని యంతరంగమా విభాజకరేఖ నతిక్రమింపనున్నది. అపుడాత డొక ప్రశ్న వేసికొనును. 'కణ్వదుహి తయే యైనచో నామె క్షత్త్రపరిగ్రహక్షమ యెట్లగును?' 'ఎట్లని నన్ను ప్రశ్నింపకుము కాని ఆమె మాత్రము నిస్సంశయముగ క్షత్త్ర పరిగ్రహక్షమయే' యని అటు పరుగులిడిపోవుచున్న ఆతని యంత రంగమే సమాధానము చెప్పును. ఇంతలో సలిలసేక సంభ్రాంతమైన మధుకర మొక్కటి ఆమె వదనబింబము నాక్రమించును. భీతిలి రక్ష ణను గోరిన నాయికకు మహారాజగు దుష్యన్తుడే రక్షకుడు కాగలడని సఖుల సమాధానము. ఆర్తరక్షకుడు, దుష్టశిక్షకుడు నగు ప్రభువుగనే నాయకు డట్టి తరి నాయికాసమక్షమున సాక్షాత్కరించును. కేవలము ప్రేమికుని పిలుపునందుకొని ప్రేమికుడు పరుగులిడిన రీతిగ గాక యిట్లు చిత్రించుట యీ సన్నివేశమున కొక యుదాత్తతను జేకూర్చినది. నాయకుని చూడగనే శకున్తల తన యంతరంగమాశ్రమ విరుద్ధమగు వికారమునకు వశమగుచున్నదేల యని తర్కించుకొనును. నాయకుడు సైతము సఖులమూలమున నామె రాజర్షియగు విశ్వామిత్రుని దుహిత

యని యెరింగిన పిమ్మటనే 'లబ్ధావకాశో మే మనోరథః' అని యనుకొనును. తరువాత విదూషకునితో నాతడీ విషయమును జెప్పుచు నొకచోట 'న పరిహార్యే వస్తుని పౌరవాణాం మనః ప్రవర్తతే' యనును. సలిలసేచన సంభ్రాంతమై, నాయికా వదనబింబము నాక్రమించిన మధుకరమును శాసింప గడంగిన నాయకుడు నాయికారూప రససేచన సంభ్రాంతమై, తదభిముఖముగ పరుగులిడుచున్న తన యంతరంగమునుకూడ యథాసంభవముగ శాసించుకొనుచునే ముందడుగు వైచినాడు.

నాయిక నాయకుని 'రాజు' అనక 'రాజర్షి' అనుచున్నది. 'యతః ప్రభృతి మమ దర్శనపథ మాగతః స తపోవనరక్షితా రాజర్షిః తత ఆరభ్య తద్గతేనాభిలాషేణైత దవస్థాస్మి సంవృత్తా'. బ్రహ్మర్షి తనయగాక రాజర్షి తనయ యగు నాయిక రాజగు దుష్యన్తుకి పరిగ్రహాక్షమమైనది. రాజుగ మాత్రమేగాక రాజర్షిగ నాయకుడును ఋషికన్యయగు శకున్తలకు కోరదగినవాడైనాడు.

విరహాసంతప్తయగు నాయిక కుపచారములు సేయుచు, సఖులామెచే నాయకుని కొకలేఖ వ్రాయింతురు. నాయిక భావమును సంపూర్ణముగ నెరింగిన నాయకుడును అదే తరుణముగ నట బ్రవేశించును. అపుడు ప్రియంవద దుష్యన్తుని ట్లర్థించుట. 'ఆర్తులను ఆపదనుండి రక్షించుట రాజధర్మము. నిన్నుగూర్చి మదనుడు మా ప్రియసఖి కిట్టి యార్తిని గూర్చియున్నాడు. కావున ననుగ్రహించి యీయామె జీవితమును గాపాడుము.' కాగా వీరి పొత్తు పెద్దలయనుమతిపై గాకపోయినను, పెద్దరికమువహించిన సఖులయామోదముననే స్థిరపడినవి. ఇట్లిరువురిని సమావేశపరచిన సఖులు హరిణశాబకమును తన్మాతృ సమీపమును జేర్చునెపంబున తొలగిపోవుదురు. అపుడు నాయికసైతము 'పౌరవ! రక్షావినయమ్. మదనసంతప్తాపి న ఖల్వాత్మనః ప్రభవామి.'

అని నాయకుని నివారించును. తాను మదనబాణ సంతప్తనని ఋజుత్వముతో నంగీకరించినది. అయినను స్వతంత్రురాలనుగానని చెప్పుచు తను దానిగ్రహించుకొనుటే గాక 'పౌరవ!' అను సంబుద్ధిమూలమున నాయకుని సైతము సంయమము ప్రదర్శింపుమనుట గమనార్హము. గాంధర్వవిధిచే వివాహితలయ్యు మున్ను పలువురు రాజర్షి కన్యకలు గురుజనాభినందితలే యైరనియు, సకలధర్మము లెరింగిన కణ్వమహర్షి యీ విషయ మెరింగియు దోషముగా పరిగణింపడనియు తాను లోన సమాధానపడిన దుష్యన్తుడు తమ యనుబంధము ధర్మానుసారియే యని శకున్తలనుకూడ సమాధానపరచును.

"ముఖమంస వివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమప్యున్నమితం న చుమ్బితం తు."

అను సుకుమార సుందరములగు స్వర్ణోక్తులలో శృంగారరస సర్వస్వము నిమిడ్చి శకున్తలా దుష్యన్తుల పరిణయమునందలి ప్రథమఘట్టమును కవి ముగించినాడు.

ఆత్మ నామాంకితమగు నంగుళీయకము నొసంగి, తద్గతాక్షరముల దినంబున కొక్కటిగా లెక్కించుచు బోవ నవి ముగియులోగా తన పరివారము వచ్చి అంతిపురికి గొనివత్తురని నాయిక నూరడించి నాయకుడు వెడలిపోయెను. ఇపుడామె అగ్నిగర్భశమీసమానయై దుష్యన్తుని పవిత్రతేజంబును, ధరియించియున్నది. ధూమాకులితనేత్రుడయ్యు హవిస్సు నగ్నిముఖముననే వేయ జాలిన యజమానుని వలె శకున్తలా దుష్యన్తుల యనుబంధము నెరింగిన కణ్వమహాముని యు తృప్తినందినాడు.

ఈ పూలరాశిలో కంటక మొండు నిగూఢమై యుండిపోయినది. తన భావములను, చర్యలను ఎంత ధర్మబద్ధములని సమర్థించుకొన్నను ధర్మసంరక్షకుడగు నొక ధారుణీపతి మునికన్నియను గాంచి చలిత

హృదయుడగుట సర్వథా సముచితమని సమర్థింప ననువుపడదు. అటులే మునికన్యకయగు శకుంతలయు దుష్యంతునిగాంచినంతనే మనోవికారము నకు లోనగుట ఆశ్రమవిరుద్ధమే. సిద్ధి ఎంత శుభప్రదమయ్యును సాధనలోగల యీ దోషవేశము పశ్చాత్తాపమను నగ్నిచేతనే నిర్మూలింప దగియున్నది. అపుడే వారిప్రణయము, జీవితము దివ్యదీధితులతో దేదీప్యమానములు కాగలవు.

ఏతత్ప్రయోజనసిద్ధికై కవి దూర్వాసశాపమును గర్వించి యున్నాడు. నాయికానాయకుల కెడబాటు గల్గినది. వారి యంతరంగములు సంతాపాగ్ని పరితప్తములగును. తొందరపాటువలన జరిగిన నేరమునకు ప్రాయశ్చిత్తము జరిగినది. నిజమగు పశ్చాత్తాపము కారణముగ వారి హృదయములు మాలిన్యవిముక్తములై ప్రకాశించినవి. వారి ప్రణయ మపుడు పదారువన్నె బంగారమైనది. పవిత్ర ప్రగాఢ ప్రణయానుబంధమున నాయికా నాయకులు తిరిగి కలసికొందురు. ఎచ్చట ! పవిత్రమగు మరీచ్యాశ్రమమున.

మధురమును, క్షణికమును నగు తొల్తటి సమాగమంబునకుగాని మధురతరంబును, శాశ్వతంబును నగు ననంతర సమాగమంబునకు గాని నాయికా నాయకులకు పవిత్రతపోవనములే రంగస్థలములు. ఆరంభమున నాయకుడు మృగయావినోదియై వెడలినవాడు; రథాశ్వముల వలె వర్ణనాతీతమగు వేగముగల యింద్రియప్రసారము గలవాడు. ఇపు డట్లుగాదు. లోకరక్షాతత్పరుడై వెడలిన రాజశేఖరు డీతడు. దేవతల బాధించుచున్న రక్కసుల నిర్జించి వచ్చుట అంతశ్శత్రువుల నిర్జించుట కుపలక్షకము. సంయమము గల్గిన లోకావనతత్పరుడుగ నాయకు డిట ప్రత్యక్షమగుచున్నాడు. నాయికయగు శకుంతలగూడ విలాసవతిగా గాక సర్వదమనునివంటి వంశోద్ధారకునికి మాతగ తననికి ప్రీతిపాత్రయగుచున్నది. లతావిసరములకు నీరువోయుచు సఖీజన

ముతో సగనసల్లాపములాడుచున్న యొక విలాసవతి రూపము కాదిది; మాతయై, ఏకవేణీధరయై సాక్షాత్కరించిన వ్రతధారిణి దివ్యనారీ రూపము. తొలుత నాయికరూపము నారాధించిన నాయకు డిపుడామె గుణముల నెంచి పాదాక్రాంతుడగుచున్నాడు. ఒక బ్రహ్మర్షి పరోక్షమున జరిగిన నేరము వేరొక దివ్యర్షి సమక్షమున చక్కబడి శుభాంతమగుట మోదావహము.

నిగ్రహమునందే ప్రణయమునకు సముచితప్రసారము. మాతృత్వమునందే స్త్రీత్వమునకు బరిపూర్ణత. లోకరక్షాతాత్పర్యమునందే సుఖసంపదలకు చారితార్థ్యము. ఔచిత్యపాలనమునందే కావ్యమునకు బ్రహ్మానంద సహోదర రసానంద దాయకత్వము.

'భారతీ కవేర్జయతు'



## మానవోత్తమ ప్రశస్తి

—శ్రీ కాళూరి హనుమంతరావు

సీ. శ్రీ జానకీపాణి సృదుమర్దితమ్ములు
ప్రియ సోదరత్ర యార్చిత తమములు
గుహాశబరీగంధ వహసుతధ్యాతముల్
మునివధూశాప విమోక్షణములు
సుగ్రీవ దశకంఠసోదరావనములు
పదపీఠ విన్యాస భాసురములు
భక్తిపూరిత హృదద్రిక్తగాయక కవి
స్తుతములు దత్కళాస్ఫోరకములు

తే. స్వపురనిర్యాత, వాహినీ సైకతవన
కటకతటవిచరిత, నిజాంకాంకితాత్మ
తమ పవిత్రితాఖిల భారతమ్ములైన
రామపదములయుగళి మమ్మాముఁగాఁత.

ఉ. ఏకశరంబు నేకసతి యేకము సత్యవచస్సుఁ గల్గి ధ
ర్మైకపథానువర్తి రఘురాముఁడు సర్వనరోత్తముండు దత్
ప్రాకటగాథ యన్ విమలపౌర్ణమయామిని మామెడంద భం
గాకులవార్ధియట్లహరహమ్ము గడుంగడు సంచలించెడున్.

క. ఓ సీతాగాథపవిత్ర
యా! సీతాగాఢవిరహ! యాత్మామలగా
థాసక్తనిఖిలనరనా
రీ సీతారామమందిరీ కృతహృదయా!



# ర ఘు వం శ నృ ప ప్ర శ స్తి

— శ్రీ కాళూరి హనుమంతరావు

మ. సరయూదీర్ఘవతీతటంబునఁ దురాషాట్పట్టణప్రఖ్యమై
పుర మొండొప్పు నయోధ్యనాఁ ద్రిజగతీ పూర్ణప్రతాపుల్ ప్రభా
కరవంశోద్భవరాట్పరంపరయుదగ్రఖ్యాతి నేలం జతు
శ్చరణాప్తిం జరియింప ధర్మము ప్రజాసౌఖ్యంకరం బై కడున్.

ఉ. ఇంద్రసమానవిక్రము లుపేంద్రగుణుల్ హరిదంతమత్త నా
గేంద్రమహాశరీరులు నహీనబలాఢ్యు లహస్పతిద్యుతుల్
చంద్రప్రశాంతచిత్తులు నిలాధర సుస్థిరబుద్ధులున్ వియద్
రుంద్రయశుల్ ద్విషన్నివహరుద్రులుఁ దత్కులజాతభూవరుల్.

చం. ఒకరుఁడు సత్యపాలకుఁడు నొక్కఁడు దేవధునీప్రవర్తకుం
డొకరుఁడు దానశౌండుఁడును నొక్కఁడు నిర్జరనాథమిత్రుఁడు
న్నొకఁడు ప్రజావచస్సులకు నొగ్గి ప్రియాంగన వీడె జీవిత
మ్మొకవిరహార్ణవమ్మ్నకలనోచ్చలితార్ణవమట్లు ఘూర్ణిలన్.

తే. ఎవరి గంభీరచారిత్ర సువిపులాప
గామయమ్ములు వాల్మీకి కాళిదాస
కావ్యవారాశు లట్టి రాఘవకులోద్భ
వుల గుణము లారవడులు గావుతను మనకు.



## మాతృమూర్తి — ద్రౌపది మాతృహృదయము

—శ్రీ అయ్యగారి నరసింహమూర్తి.

'యత్రనార్యస్తుపూజ్యన్తే రమన్తే తత్రదేవతాః, యత్రైతాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాఫలాః క్రియా'— అని స్త్రీకి సంఘమునఁ గల వ్యక్తివైశిష్ట్యమును ప్రాచీనస్మృతులు నిర్వచించినవి. రక్తసంబంధము లేనట్టియు, పరుని భార్యయైన స్త్రీని 'భవతి— పూజ్యురాలా— సుభగీ— సౌభాగ్యవంతురాలా— భగినీ— సోదరీ'— అని సంబోధింపవలెనని స్త్రీలను బలుకరించుటలోఁ గూడ గౌరవమును గనుపఱుపవలెనని సూచించినారు. ఇక సంతానవతియై మాతృత్వము నందిన స్త్రీకి ప్రపంచమునం దద్వితీయ మైనస్థాన మీయఁబడినది. కన్నతల్లిని మించి వేఱొదైవము లేద'ని యొకసూక్తి. "నాస్తిమాతృసమం దైవమ్."

'ఉపాధ్యాయాన్ దశాచార్య; ఆచార్యాణాం శతం పితా, సహస్రంతు పితౄన్మాతా గౌరవే ణాతిరిచ్యతే'— పదిమంది ఉపాధ్యాయులకంటె నొక యాచార్యుఁడు హెచ్చుగౌరవార్హుఁడు. వందమంది ఆచార్యులకంటె తండ్రి హెచ్చుగఁ బూజ్యుఁడు. తండ్రికంటె వేయిరెట్లు తల్లి యెక్కుడు పూజ్యురాలు— అని మనుస్మృతి (2–145) పతితఃపితా పరిత్యాజ్యో మాతాతుపుత్రే నపతతి" (వసిష్ఠ 13–47) పతితుఁడైన తండ్రిని వదలివేయవలెను. తల్లియన్నో పుత్రుని దృష్టిలో నెన్నఁడును బతితురాలు కాదు. అంతేగాక తల్లి దోషములనుగూర్చి చింతించుటకైనను గుమారున కధికారము లేదు. ఈ విధముగ సంఘమున మాతృదేవత కనుత్తమమైన స్థానమీయఁబడినది. అసలు మాతృత్వము నందనిదే స్త్రీకి పరిపూర్ణత చేఁగూరదని సనాతనులవాక్కు.

తల్లియనఁగాఁ దనకున్నను లేకున్నను తనసంతతికిఁబెట్టి యానందించునదని యొక నిర్వచనము. 'జాతిఫలమ్ముల మమ్ము నవమాస

మ్ములు మోసి తీయపాలముద్దులతోఁ గనిపెంచిన యమ్మలకు వందన మ్మని యొక గేయరచయిత కడుకమ్మగా గళమెత్తి చాటినాఁడు.

సర్వసాధారణముగా నాఁడుబిడ్డ కన్యాత్వమును వీడి సహధర్మ చారిణియై మాతృత్వము నందినపిదప నామెలో సహజముగ ననిర్వాచ నీయమైనయనుభూతితోఁబాటు కరుణార్ద్రరాగరసరంజితమైనహృదయ పరిణామముకూడఁ గలుగును.

ఇఁక తల్లిచేతలో- మాటలో- లాలింపులోఁగల నేర్పేమియో గాని ఆవేశములోఁగాని, కోపములోఁగాని బిడ్డలను జావఁగొట్టినను ఆబిడ్డలే మరుక్షణములోఁ దమంతతామై తల్లిసరసన చేరుదురు. తండ్రి యొకసారి కసరినను లేక కొట్టినను చాలరోజులవఱకును బిల్లలు వానికడకుఁ బోవుటకు జంకుచుందురు. ఎంతటివాఁడైనను దెబ్బతగిలి నపుడుగాని ఆపదలో నున్నపుడుగాని 'అమ్మా'యని యనును. 'అబ్బ' యనుటయును గలదు. గాని చాల నకృత్తు. తల్లిలో నుండేదియాశక్తి మాత్రమనిర్వాచనీయము. మాతామూర్తిః పృథివ్యాస్తు(మాతపృథివి యొక్క మూర్తి) (మను. 2-225) సహనము, ఓర్పు, నేర్పు లాలింపు- ఇవి స్త్రీకి పెట్టనిసొమ్ములు.

స్త్రీలకు భగవంతుఁడు ప్రసాదించిన వరములలో వాక్చాతుర్య మొకటి. సర్వసాధారణముగఁ గోపము, ఈర్ష్య, ఉద్రేకము, పగ- ఇవి మానవులకుఁ గలిగినపుడు అవతలవ్యక్తినిఁబట్టి, చేసినకార్యమును బట్టి వారి కానమయమునఁ గలిగిన క్రోధాగ్రహావేశములఁ బరిమితినిఁ బట్టి తిట్టుటయో, కొట్టుటయో చేయుదురు. కొద్దిమంది మాత్రము బుజ్జగింపుమాటలవంటి పలుకులతో హృదయము తూట్లుపడునట్లు, శల్య ములు విఱుగునట్లును, ఈ జీవితమునసేగాక మఱియేజన్మమునఁగూడ నట్టికార్యమును జేయరాదను దలఁపు కలుగఁజేసి, చేసినపనికి సిగ్గిలి, క్రుంగి, కృశించిపోవునట్లు చేయుదురు. భాగవతమునందలి ద్రౌపది రెండవ తరగతికిఁ జెందినవ్యక్తి.

కవి యభిరుచినిబట్టి కావ్యగతపాత్రల మనస్తత్త్వముఁబండునని యాలంకారికుల మతము. భక్తిభావమునకుఁ గరుణకు నాలవాలమైన పోతన భాగవతమున ద్రౌపదీ మాతృహృదయా విష్కరణము పరాకాష్ఠనందుకొన్నది.

కురుక్షేత్ర సంగ్రామానంతరము పితృ, భ్రాతృశోకములచే ద్రౌపదిలోఁ గలిగిన హృదయపరివర్తనమమోఘము, నద్వితీయమునై నివాతదీపము, శరచ్చంద్రికలవలె నిశ్చలము, నిర్మలమునైనది. అనఁగా దనసంతతిని మాత్రమే ప్రేమించి వారి వియోగములకు దుఃఖించునట్టి సామాన్య స్త్రీ హృదయమువంటిదిగాక యితరుల సంతతినిఁగూడ తన బిడ్డలవలె లాలించి, పాలించి, వాత్సల్యానురాగములను జూపి సంతాన వతియైన ప్రతిస్త్రీకినిఁ గలుగుకష్టములను సార్ద్రదృష్టితో వీక్షించి యౌదార్యమును వెల్లఁడింపఁగల యనుత్తమమైన మాతృత్వమును నెలకొన్న మహామహిమాన్వితురాలు.

కురుక్షేత్ర సంగ్రామానాంతరము ద్రోణపుత్రుఁడగు నశ్వత్థామ దుర్యోధనునకుఁ బ్రియంబుసేయువాఁడై సుషుప్త్యవస్థలో నున్న యుపపాండవుల శిరములను ఖండించినసంగతి కర్ణములఁ బడినంతనే బాష్పతోయకణజాలము చెక్కులరాలునట్లుగా రోదించిన దేగాని వెనుకటివలె నామె మనమునఁ బ్రతీకారవాంఛ పొడసూపలేదు. కారణమామె యింతకుమున్ను హిడింబాసుభద్రలకువలెఁ గడుపుశోక మెఱుఁగదు. స్త్రీజాతికి నిసర్గమైన కన్నకడుపుతీపిని ఈ నాటికి గుర్తెఱింగినఁదగుటచే నక్షీణతనూజశోకయగు నా ద్రౌపది సుతిమెత్తని పలుకుల తోడనే యశ్వత్థామ మర్మస్థానముల నాటుకొనునట్లును, వజ్రతాడనముకంటె దుర్భరమైన వేదనను గలుగఁజేసి హృదయపుటభేదనము గావించి జీవన్మృతిగా నొనర్చినదేగాని యసురకృత్యమునకుఁ బ్రేరేపింపలేదు.

బాలుర మరణము కర్ణములఁ బడఁగలఁ తపడి యోర్వజాలక వ్యథనొందుచున్న ద్రౌపదినిఁ గాంచి కిరీటి యామె చికురజాలమును దువ్వుచు, "మద్గాండీవ నిర్ముక్త భీకర బాణంబుల నేడశ్వత్థామ శిరమ్మును ఖండించి తెచ్చెద" నని, ఆ శిరమునుఁ ద్రొక్కి జలంబులాడుమని అనునయించినాడు నరుఁడు హరి మేలమాడుచుండ కవచగాండీవములను ధరించి రథము నధిరోహించి పోయి యశ్వత్థామను బాశబద్ధునిగాఁజేసి హరివచనానుసారంబుగా నశ్వత్థామను వధింపక ధర్మంబును, ద్రుపదాత్మజకడఁ జేసినప్రతిజ్ఞను దలంచి పాశబద్ధుండైన గురుసుతుని ద్రౌపది పాదములకడఁ బడవేసినాఁడు.

శోకముచేఁ గుందుచున్న మఱియే స్త్రీయైనను దత్సమయమున వెంటనే ఘాతుకుని హతమార్పుమని భర్తకుఁగాని, పరిజనమునకుఁ గాని యాదేశ మొసంగుటయో లేక తాను నోటికివచ్చినట్లు తిట్టుటయో, శక్తియున్నచోఁ గొట్టుటయో చేసియుండును. కాని యిట ద్రౌపది యేమాత్రమును నిగ్రహమును గోల్పోవక ధర్మము నుజ్జగింపక పుష్పబాణములవంటి పలుకులతో గాసిఁబెట్టినది. క్రూరునిగాని, దుష్టునిగాని, సన్మార్గవర్తనునిగాఁ జేయుటకు ద్రౌపది విధించినదండన మమోఘమైనది. ఈ విధముగ మానవులలో మనఃపరివర్తనమును దీసికొని రాఁగలుగువారు లోకమున నరుదుగా నుందురు. ఈమె పలికిన యొక్కొక్క పలుకును వజ్రతాడనముకంటెను దీవ్రతరమైనది. అర్జునుండు దెచ్చిచూపిన యశ్వత్థామ బాలవధజనిత లజ్జాపరాఙ్ముఖుఁడు, అవాఙ్ముఖుండునై యుండ ఆ గురుపుత్రునిం జూచి సుస్వభావయగు ద్రౌపది మొదట ఆతనికి మ్రొక్కినదట.

అశ్వత్థామ సర్వశాస్త్రములను జదివినవాఁడు. కార్యాకార్యములను, ధర్మాధర్మములను, యుక్తాయుక్తములను బాగుగా నెఱింగినవాఁడు. కనుకనే ఆతఁడు తన చేసినపనికి లజ్జాపరాఙ్ముఖుఁడైనాఁడు.

ఘాతుకున కురిశిక్షకంటె వేఱుశిక్ష లేదు. అప్పటికి ద్రౌపది పుత్రశోకముచే నింకను బొగులుచునే యున్నది. అయినను ధర్మజ్ఞానము, దూరదృష్టిగలదగుటచే నేమియు పలుకకయే ముందుగా నశ్వత్థామకు మ్రొక్కినది. ప్రళయము సంభవించి తనప్రాణము పంచమహాభూతములలోఁ గలియఁ వలసియున్న తరుణమున భీతిగొల్పు వాతావరణము లేక ప్రశాన్తముగా నుండుట యేరికి ఆశ్చర్యజనకము గాకుండును ? ఆమె ఘాతుకుఁడైన యశ్వత్థామకు మ్రొక్కుటలోఁ గల యాంతర్యమును, ధర్మసూక్ష్మమును నొకపఱి యవలోకింపుఁడు.

పరగన్ మామగవారలందఱును ముస్ బాణప్రయోగోపసం
హారణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి పుత్రాకృతినున్న ద్రోణుఁడవు నీచిత్తంబులో లేశమున్
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే ?

తన మగలకాచార్యుఁడు ద్రోణాచార్యుఁడు. గురువునకు శిష్యులు పుత్రులవంటివారు. పురుషుఁడు భార్యగర్భంబునం బ్రవేశించి పుత్రుండై తాన యుద్భవిల్లుం గావున 'అఙ్గాదఙ్గాత్ సమ్భవసి' యను వచనముచేనిట నీయశ్వత్థాను పుత్రరూపములో నున్న ద్రోణాచార్యుఁడే. కావున పూజనీయుడు. మఱియు బ్రాహ్మణుఁడు. బ్రాహ్మణుఁ డెట్టికార్యమొనర్చినను జంపఁదగనివాఁడు. ఎల్లవేళల పూజనీయుఁడే. ఆ కారణమున ద్రౌపదికి నశ్వత్థామ యవశ్యము వందనీయుఁడైనాఁడు.

"నాపతు లేవురును మీ తండ్రికడ శస్త్రాస్త్రవిద్యల నభ్యసించినవారు గదా ! పుత్రరూపముననున్న ద్రోణుడవగు నీవే, నీశిష్యసుతులను సంహారించుట న్యాయమేనా ! మనమున నీషణ్మాత్రమైన కరుణలేకపోయినదా?" యని పలుకరించినది. ద్రౌపది యీ చర్యకు అశ్వత్థామ సగము చచ్చియుండును. ఈ సందర్భమున సంస్కృతభారతమున మఱింత చక్కఁగాఁ జెప్పఁబడినది. పాశబద్ధుఁడైన యశ్వత్థామను

గాంచి సహింపనేరక యర్జునునితో "ముచ్యతాం ముచ్యతాం ఏష బ్రాహ్మణోఽనితరాంగురుః" (విడువుము విడువుము ఇతఁడు బ్రాహ్మణుఁడు. గురువుకంటె వేఱుకాడు). ద్రౌపది ఎంతటి కరుణాసముద్ర హృదయయో ఈ మాటలవలనఁ దేటపడుచున్నది.

నీవు భూసురుఁడవు. అంతేకాదు. బుద్ధిదయాభాసురుఁడవుకూడ. నీకు నీవై చేయఁదగని దీ కృత్యము. శిశువులను జంపుట రాక్షసులకుఁ జెల్లినదిగాని నీవంటివానికి ధర్మమగునా? 'తండ్రీ' యని సంబోధించినది. ఘాతుకకృత్య మొనర్చినవానిపైనను ఎంతటి ఆప్యాయతయో చూడుఁడు. ద్రోణునకు ధర్మజాదులు పుత్త్రులైనపుడు ఈమె కాతఁడు 'మామ' యగునుగదా. (శిష్యులు పుత్త్రులవంటివారు గనుక). మామయు తండ్రివంటివాఁడే గదా! ఇట నశ్వత్థామ పుత్రాకృతిలోనున్న ద్రోణుఁడు. కనుక నిట 'తండ్రీ' యను సంబోధనము సముచితమైనదియే. 'తండ్రి' శబ్దమునకు 'కుమారా'యని యర్థము చెప్పుకొన్నను ఆమెవాత్సల్యమున కది 'పరసీమ' యగును. ఎట్లైనను ఈసంబోధనము చిత్రముగనే యున్నది. ఈ సంబోధనచే నశ్వత్థామ మఱికొంత చచ్చియుండును. ఉద్వేగము, ఆక్రోశము- ఈ మొదలగు లక్షణము లేమియు చేకుండగ చలి ఎముకలను కొఱికి బాధపెట్టునట్లు నీసంబోధనము ఆతని శల్యములను గొఱికి బాధపెట్టఁజాలినది.

ఇఁక ఉపపాండవులు ఉద్రేకమునరారు. శస్త్రధరులై యుద్ధభూమియందు లేరు. కించిద్ద్రోహంబును నీకు బలోత్సేకంబుతోఁ జేయరుగదా! మఱియు వారు పిన్నపాపలే. చిన్నపిల్లలను జూచినపు డెవరికైన 'ముద్దు- ముచ్చట' కలుగుట స్వాభావికముగదా! అట్టితఱిభద్రాకారులు, రణప్రౌఢక్రియాహీనులు, నిద్రాసక్తులునైన యా ఉపపాండవులను జంప నీచేతు లెట్లాడెనో గదా! యని యనినది.

తాము కష్టదశలో నున్నపు డెట్టి పరితాపము ననుభవింతురో యట్టిస్థితియం దితరులును నట్టిపరితాపమునే బొందుదురనుటను గుర్తిం

పక తమకుఁ దోచినవిధముగఁ బలుకుచుండుట లోకములోఁ బెక్కురి స్వభావముకాని ద్రౌపది హృదయము పరిపక్వమై నిశ్చలమైనది కావు ననే మాతృత్వము మూర్తీభవించి మాతృదేవతయై యశ్వత్థామను జంపుట కామె యంగీకరింపలేదు. యుక్తాయుక్తముల నెఱింగినవారైనను ఆచరణలోఁ బెట్టువారు దివానక్షత్రము లంతమందియుండుట ఎల్లరు గ్రహించినవిషయమే. భారతమునందలి విలక్షణ మనస్తత్వము గల పాత్రలలో నీమె యొకతె.

కందుఁగల పసిడిగాచిన కంది వివర్ణమైన రీతిగాఁ బుత్రశోకాగ్నిచేఁ దప్తమైన ద్రౌపది హృదయము నిర్మలమై మాతృత్వమునకుఁ బరసీమయైనది. కనుక నే,

అక్కట పుత్రశోకజనితాకుల భారవిషణ్ణచిత్తనై
పొక్కుచునున్న భంగి నినుఁ బోర కిరీటి నిబద్ధుఁజేసి నే
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నే
డెక్కడ నిట్టిశోకమున నేడ్చుచు పొక్కుచున్నదో !

యని వ్యథ చెందినది. కష్టమువలనఁ గలుగుబాధ అందఱకును నొకటియే యని గుర్తింపఁగలిగినదీ వనితారత్నము. 'ఆత్మవత్సర్వభూతాని' యని గుర్తించుట - దాని నాచరణలోఁ బెట్టుట కేవలము మహాత్ములకుఁ గాక అన్యుల కసాధ్యముగదా!' ఒరులేయవి యొనరించిన, నరవర యప్రియము తనమనంబున కగుతా, నొరులకు నవి సేయకునికి, పరాయణము పరమధర్మపథముల కెల్లన్' అనిగదా సూక్తి. ఈమె తక్క ఈసూక్తిని యక్షరముల పాటించిన పుణ్యమూర్తిని లోకమునఁ గానముగదా !

ఇంతసేపు మాటాడినను ఈమె యొకతఱియైన ఒక్క పరుష వచనమును బలుకకుండుట గమనింపఁదగిన విషయము. కాని ప్రతి పలుకు శల్యమును బట్టి బాధించునదే. హృదయ మున్నవాని కింత కంటె కఠినమైన శిక్ష వేఱొకటి యక్కరలేదు.

హృదయము ద్రవించి కరుణ వెల్లివిరియునట్లు పలికిన ద్రౌపదితో నశ్వత్థామ తాఁ జేసినది రాక్షసకృత్యమగుటచే నేమియు పలుక నోరాడక నిరుత్తరుఁడై జీవచ్ఛవమువలె నుండెను.

ఇక ద్రౌపది తానై యశ్వత్థామతోఁ బలుకవలసిన దేదియు లేదు. ఘాతుకకృత్య మొనరించినవానిని తాను క్షమించినను మిగిలినవారు ఊరుకొనక అశ్వత్థామను వేధింతురను భీతిచేఁ గాఁబోలు కృష్ణార్జునులను గాంచి యీ విధముగఁ బలుకుచున్నది.

"ద్రోణునితో శిఖంబడక ద్రోణకుటుంబిని యున్నదింట న
క్షీణతనూజశోక వివశీకృతనై విలపించుభంగి ని
ద్ద్రౌణి తెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంతపొక్కెనో
ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింసమానరే!"

మానవహృదయము నింత గంభీరముగ నధ్యయనము చేసికొనిన వ్యక్తులెందఱుందురీ లోకములో. మానవ మనస్తత్త్వశాస్త్రమున పారము ముట్టిన ఏకైక విదుషీమణి ద్రౌపదియే యనినను నతిశయోక్తి గానేరదేమో !

సంస్కృత భాగవతమున ద్రౌపదిఁ బలికిన పలుకులు మిక్కిలి మనోహరములు; అత్యంత సముచితములునై యున్నవి.

"మారోదీత్తస్య జననీ గౌతమీ పతిదేవతా, యథాహం మృతవత్సార్తారోదిమ్య శ్రుముఖీముహుః" (నే నేవిధముగ మృతవత్సార్తనై అశ్రుముఖినై మాటిమాటికి నేడ్చుచుంటినో పతిదేవతయగు నీతని జనని యట్లేడువకూడదు.)

ధర్మజునితోఁ బల్కిన పలుకులును మిక్కిలి సముచితముగనే యున్నవి.

"తద్ధర్మజ్ఞ మహాభాగ భవద్భిర్గౌరవంకులమ్ । వృజనం నార్హతి ప్రాప్తుం పూజ్యం వంద్యమభీక్ష్ణశః" (ధర్మజ్ఞ! మహాభాగ! మీవలనఁ బూజ్యము, వంద్యమునగు నట్టి గురుకులమునకుఁ జేటుగలుగరాదు).

ఇవి నవనీతమువలెఁ దాపము నుపశమింపఁజేయు పలుకులు గదా! గురుకులమన్నను, బ్రాహ్మణులన్నను నీ మెఱుఁగల ఆస్థ, పూజ్య భక్తిభావము లెట్టివో పై పలుకులవలనఁ దెలియనగును.

"భూపాలకులకు విప్రుల, కోపింపం జేయఁదగదు, కోపించిన త, త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులగాంచు భూకంపముగాన్."
అని బ్రాహ్మణ పరిభావమును దెల్పినది. ఈ రీతిని ధర్మంబును, కరుణంబును, నిర్వ్యాళీకంబును సమంజసమును శ్లాఘ్యంబుగాఁ బలికిన పలుకుల కందఱును సమ్మతించిరి. సమ్మతింపని భీముఁడు.

"కొడుకులఁ బట్టి చంపెనని కోపమునొందదు బాలఘాతకున్
విడువుమటంచు చెప్పెడిది వెఱ్ఱిది ద్రౌపది వీఁడు విప్రుఁడే
విడువఁగ నేలఁ జంపుఁడిటు వీనిని మీఁగలు జంపరేని నా
పిడికిటి పోటునన్ శిరము భిన్నముచేసెదఁ జూడుఁడిందఱున్".

అని విజృంభింపఁగా ద్రౌపది యడ్డంబు వచ్చెను.

అంత నా చక్రి వాయునందనున కడ్డంబు వచ్చి ధర్మము నుపదేశించి యాతని ప్రతిజ్ఞ వ్యర్థము గాకుండునట్లుగా నశ్వత్థామ శిరోజములు తఱిగి చూడాంతర్గత మనోరత్నమును గొని పాశబంధముల నూడ్చి పంపుమని యర్జునున కాదేశించినాఁడు.

ఎట్టి స్థితియందును ధర్మమును విస్మరింపక 'స్త్రీహృదయము స్త్రీయే యెఱుంగఁగలద'ని నిరూపించి యక్షీణ తనూజశోకయగు నా ద్రౌపది హంతవ్యుఁడు, అక్షంతవ్యుఁడునగు నశ్వత్థామను క్షమించి పల్లెత్తు పరుసంపు పలుకునైనను బలుకక ఎంతగౌరవము నీయవలెనో యంతగౌరవము నిచ్చి మాతృస్థాన మద్వితీయమైనదని మాతృమూర్తి కేవల మపరదేవతామూర్తి యని జగమునకుఁ జాటి చెప్పినది. ఈ పవిత్రమూర్తి స్త్రీలోకమునకేగాక మానవజాతికే మాననీయమైనదనుటలో నెట్టి విప్రతిపత్తియునుండఁబోదు.

# గాధేయచరితమ్ — ప్రథమః సర్గః

— శ్రీ దురిశేటి వెంకటరామాచార్యః.

( శిశిర సంచికానంతరమ్ )

ఉపనిన్యే యథాకాలం గురుణా బ్రహ్మవేదినా
శాణక్షతిం మణి రివ స్థాప త్వక్ష్ణేన శిల్పినా.
క్రమే ణావివిశు ర్విద్యా స్తం బాలం గురుయత్నతః
చంద్రస్య ద్యుతయః స్వచ్ఛా భాస్వంత మివ దర్పణమ్.
వేదం శాస్త్రం పురాణం చ సర్వం జజ్ఞే స మేధయా
అస్తి చే దస్తి చే న్నాస్తి నాస్తి దైవం హి దుర్గమమ్.
భృశాశ్వం తీవ్రతపసం తప మిద్ధ మివారుణః
జగ్మివాన్ స తు గాధేయ ఇష్వస్త్రే సంజిఘృక్షయా.
ఇష్వస్త్రే యోగ మాతస్థే శరా నస్యన్ దివానిశమ్
అంశుమా లీవ కిరణాన్ నోద్యమః సుఖ మీక్షతే.
గురుః ప్రజాపతి స్తుష్టో భృశాశ్వో ఽస్త్రభృతాం వరః
అంతేవాసిని శుశ్రూషా గురో ర్జ్ఞానం ధనా త్పరా.
శ్రద్ధా భక్తి ర్వినీతి శ్చ ఛాత్రం పాత్రం సముద్ధరేత్
త్రయీవ బ్రాహ్మణం పూతం రాజాన మివ శక్తయః.
ప్రజాపతే ర్భృశాశ్వస్య జాయే దక్షస్య పుత్రికే
తే ద్వే పుత్రా నసువతాం దీప్రాన్ పంచాశతం సమమ్.
సుతాః శతం తే ఘోరాస్త్రరూపా భీషణమూర్తయః
శరత్సహస్రం తప్తస్య తపసో యే పితుః ఫలమ్.
సప్రయోగోపసంహారం సరహస్యం సమంత్రకమ్
గురుః పుత్రాన్ దదౌ తస్మై గురుణా కిం న దీయతే.
తై ర్దుర్జయై ర్మహాత్మా స కౌశికో నితరాం బభౌ
నిదాఘ ఇవ మధ్యాహ్నే ఖరభానుభి రంశుమాన్.
అబ్రువం స్తే మహాత్మానం కౌశికం ధన్వినాం వరమ్
దుర్జయాః కిం కరిష్యామో తే సురై రసురై రపి.

తే భూత్వా రేజిరే తస్య మానసా గూఢ మాజ్ఞయా
రహో నిగూఢా వల్మీకే దీపా ఆశీవిషా ఇవ.
పితామహో త్త్వవేదే స బలా మతిబలా మితి
మాతరా విప యే విద్యే క్షుత్తృషాభ్యాం రరక్షతుః,
విద్యయా తేజసా కాంత్యా వయసా ఽస్త్రేణ భాస్వరః
పరేషాం దుర్నిరీక్ష్యో ఽపి స్వజనప్రియదర్శనః.
వినీతో ఽసౌ గురుజనే పరస్మిన్ సింహవిక్రమః
రత్నైర్న్యాదోభి రివ చ గమ్యో ఽగమ్యో మహోదధిః.
తాదృశం చ సుతం వీక్ష్య భవిష్యద్భోతిరికారకమ్
ముముదే గాధి రంభోధి శ్చంద్రం దృష్ట్వేవ పర్వణి.
పరేషాం శోకదాతారం కర్తారం స్వజనే ముదమ్
సుతం మహీపతిం కర్తు మియేష జరఠో నృపః.
నదీనదసముద్రేభ్యః పవిత్రై రాహృతోదకైః
అభ్యషిచ్యత పిత్రా స పూతమంత్రైః పురోధసామ్.
కిరీటహారకేయూరభూషో భద్రాసనే స్థితః
బాలార్క ఇవ రేజే ఽసౌ తిష్ఠ న్నుదయపర్వతే.
తాతేన గాధినా దత్తం రాజ్యం ప్రాప్య స గాధిజః
చకాసే భానునా కాంతి మివ పూర్ణసుధాకరః.
నవా ముగ్ధా నాయికేవ హృష్టా పుష్టా చ మేదినీ
తస్మిన్ రాజ న్యనేకై స్తత్పూర్వై ర్భుక్తా ఽపి రాజభిః.
పురాణం దళ ముత్సృజ్య మధా విప నవం తరుః
భావం నవీనం ధృతవాం స్తస్మిన్ రాజని తజ్జనః.
నద్యః సువేణీభరితాః పర్జన్యః కాలవృష్టిమాన్
జనో యద్భావ మాధత్తే దత్తే దైవం హి తత్ఫలమ్.
పరస్పరవిరుద్ధే హి నీతి రీతి శ్చ సర్వథా
యత్ర నీతి స్తత్ర నేతి రోక్తే చేన్నీతి స్త దేతయః.

యత్ర రాజా హి ధర్మాత్మా స్వధర్మా తత్ర తత్ప్రజా
కల్పవృక్షసమాశ్లిష్టవల్లి కావ్యమృతాయతే.
బహుధేష్ట్వా స యజ్ఞేన పుపో షేంద్రం సదైవతమ్
పురుహూతో ఽపి సో ఽన్నేన రాజానం తం సహస్రజమ్.
విద్యావినయసంపన్నో జనః సిష్ణేహ తం నృపమ్
భర్తార మన్నదాతారం మూఢో ఽపి న హి ముంచతి.
సర్వో జనో దయాసత్యశౌచభావై రలంకృతః
ప్రతిబింబం భవేత్ స్వచ్ఛం యది స్వచ్ఛో హి దర్పణః.
ధర్మనిర్వాహణా యైవ చిక్యే ఽర్థం సో ఽనిశం జనః
త్యాగభోగవియుక్తో ఽర్థో ఽనర్థో నశ్యతి సర్వధా.
అర్థార్థం బిభిదే తత్ర న హి కో ఽపి పరస్పరమ్
ధావ త్యమూఢం నిఘ్నో ఽర్థో మూఢ స్త మనుధావతి.
ఈశావాస్య మిదం సర్వ మితి జజ్ఞే ఽఖిలో జనః
తే నాశృధ్ను రనర్థాయ సో ఽర్థాయ దృఢనీతిమాన్.
మర్యాదయా చ పరియా యుక్తః కామో దివానిశమ్
అసిధారావ్రతం నామ తప స్తేపే సుదారుణమ్.
దారాణాం సంగ్రహ స్తత్ర సంతానప్రాప్తయే ఽభవత్
బ్రహ్మ సత్య మితి జ్ఞాతే సతి భోగేషు కిం పునః.
ఏవం త్రివర్గణామిన్యో నీతియుక్తా హి తత్ప్రజాః
ధర్మ స్యార్థస్య కామస్య రాజ్ఞి గోప్తరి కౌశికే.
నాకాలమరణం తత్ర న చౌర్యం నో గదో ఽపి చ
ధర్మే మూర్తిమతి త్రాతరి ఇవ శాసతి కౌశికే.
భండనే తుములే శత్రూ నజయ ద్విక్రమేణ సః
పంచాగ్నిమధ్యే తపసా తప స్వీవ మనఃస్థితాన్.

అక్షయ్యం కోశ మాదాయ ప్రీణితా మరుతో ఽఖిలాః
నృపేణ తపనే నేవ గస మాదాయ కర్షకాః.
ఏకం సితాతపత్రం త త్సుధాకరసుధామయీమ్
ప్రాసారయ చ్ఛరజ్యోత్స్నా మాసేతుహిమపర్వతమ్.
నిరంతరం వీజ్యమానే చామరే శత్రుమూర్ధసు
నతేషు తత్పాదపీఠే ఽధునుతాం వితతం రజః.
తతర్జాస్య వియద్గంగాభంగపూతసమీరణైః
కంపితాగ్రా వైజయంతీ పత్రిణాం సమరుద్గణమ్.
ఇత్థం పాలితగోత్రో ఽసౌ గోత్రాధీశాధినాయకః
ధర్మోత్తరం వీతశోకం రాజా రాజ్య మకారయత్.



# కృతజ్ఞత

విద్వాన్ శ్రీ గున్నేపల్లి అక్షయలింగ కవి.

తే. గీ. సిరులనెడఁబాసి 'పితృసమోజ్యేష్ఠ' యనెడి
పెద్దలహితోక్తి దలఁదాల్చి ప్రేమమీఱ
ఘోరవనవాసమునను బాల్గొంటివౌర!
మఱది! నీయభిజ్ఞత నెట్లు మఱతునోయి! 1

తే. గీ. సర్వవిధముల నంగరక్షకునిబోలె
దండకారణ్యమున మమ్ము నిండుభక్తిఁ
గొలిచి నగరసౌఖ్యమును జేకూర్చినావు
మఱది! నీ విధేయత నెట్లు మఱతునోయి! 2

తే. గీ. శ్రమతలంపక నాఁడు నీ సంతరించు
నాటవికవస్తువై భవమ్ములరనవుర!
పర్ణశాలసైతము దివ్యభవనమయ్యె
మఱది! నీ కౌశలము నెట్లు మఱతునోయి! 3

తే. గీ. పరిసరారణ్యసీమల నరసిఁగురసి
పరిమళము నివ్వటిల్లు క్రొవ్విరులు దెచ్చి
వేడ్క జనియింప నాకు నర్పించినావు
మఱది! నీ యాదరము నెట్లు మఱతునోయి! 4

తే. గీ. అరసి తెచ్చిన నవ్యఫలాళియందు
నీయనేర్చితి నాకెంతొ యిష్టమనుచు
దోరపండుల నెంచి తోడ్తో; నయారె!
మఱది! నీ విశిష్టత నెట్లు మఱతునోయి! 5

తే. గీ. అకట ! నిను బేలనై తూలనాడునపుడు
నాదుకఠినోక్తులకు నెంత నవసినావొ ?
యించుకేనియుఁ గినుక వహింపవైతి
మఱది ! నీప్రశాంతత నెట్టు మఱతునోయి ! 6

తే. గీ. కడకఁ జేదోఁడువాదోడుగా మెలంగి
గహనమునఁ బట్టణమ్మున గారవమున
సంతతామోద మొనఁగూర్పఁ జాలినావు
మఱది ! నీ గుణోన్నత నెట్టు మఱతునోయి ! 7

తే. గీ. నెమ్మమై మఱదులు వధూనికలఁగాంచి
గారవింతురుగాక ! నీ కరణి నెవుడు
జగతి నీవృత్త; మా ధర్మమగును గాక !
మఱది ! లక్ష్మణ ! నిన్నెట్టు మఱతునోయి ! 8



శంక:— (చిరాకుతో) ఛీ- ఛీ- నీ వటరా? ఏడుపు మొగముతో నీ ప్రాంతమున దిరుగుచున్నావేమి?

భృంగి:—అయ్యో! అట్లు తూలిపోవుచున్నారేమి? ఆ చెమ్మట లేమి-ఆయొడలికంప మేమి? ఆగద్గదకంఠ మేమి? దేవా! దేవా! చెదరిన జటాభాగమును రవంత సవరింపనిమ్ము. సడలినగజచర్మాంబరమును జక్కజేయనిమ్ము.

శంక:—అట్టే వాగక యాసుందరి యెటనున్నదో యెఱిగింపుము.

భృంగి:—ఏ సుందరి? గంగాదేవియా?

శంక:—నీ మొగము (అని పరుగిడిబోవును-భృంగి వెంట నంటును.)

## చతుర్థాంకము - తృతీయరంగము

ప్రదేశము:—హిమాలయతటము.

ప్రవేశము:—భగీరథుడు (శివలింగమున కెదుట ధ్యానముగ్నుడై)

(అంత మోహిని మెల్లగ ప్రవేశించి, శివలింగము వెనుక దాగును.)

శంక:—(ప్రవేశించి) ఈ దయనీయుని- ఈ విగహవేపమానకృశాంగుని నీ శివు నీరీతిగ చిక్కులు వెట్టెదవా? కుసుమసుకుమారివే. నీ కీవజ్ర కాఠిన్య మెప్పటినుండి యేర్పడినది? (భగీరథుని సమీపించును.)

భగీ:—(కనుల విచ్చి హర్ష సంభ్రమముతో లేచి) హర! హర! మహాదేవ! శంభో! శంకరస్వామి కీనాటి కీకింకరునిపై గరుణ గల్గినదా!

శంక:—పౌగడ్తల కేమి? చెప్పుము. తొలుత త్వరగ చెప్పుము.

భగీ:—మహానుభావా! ఉమామనోహరా! ఏమటు లస్తిమితమూర్తులై యుంటిరి? అసమయమున నీదాసుని యల్పతప మాహ్వానించినదా? భక్తజనైకవత్సలా!

శంక:—చెప్పెదవా? లేదా?

భగీ:—దేవాదిదేవా! అంతటి దూరమునుండి యధికాయాసముతో నరుదెంచిరే. ఆ వేదికపై నాసీనులై కాసంతబడలిక దీర్చుకొని

యీ దాసానుదాసుడు మీచరణసరోజములపై సమర్పించుకొను నొకటిరెండుపూవుల...

శంక:—మాయావీ! నా జగన్మోహిని నిట దాచి యిటు కైతవవినయములతో గాలయాపనము సేయుదువా! సవ్యముగ జూపెదవా! లేక...

భగీ:—మహాత్మా! ఆర్యామహాదేవికిగూడ నాయందు కృపగలిగి యరుదెంచినదా? ఆహా! ఆమె యాశ్రితకల్పవల్లి. దయామయి.

శంక:—ఓ మాయాతపస్వీ! ఇపుడు నీ వెవనితో బరిహాసముగ బ్రసంగించుచుంటివో తెలియునా?

భగీ:—భగవానుడా! నీ యగ్నిపరీక్షల కీదీనుడు తాళగలడా? నీవు నన్ను రక్షింప దయచేసిన శంకరపగమాత్ముడవని నే నెఱుగనా? ఆపాటి గుర్తింపజాలనా? అదియే ఫాలనేత్రము. అదియే జటాజూటము. అవియే విభూతిరేఖలు. అవెగో భుజంగభూషణములు. అదెగో యానాడు గజాసురుని కోరికను మన్నించి ధరించిన చర్మచేలము.

శంక:—ఈ యున్మత్తునితో బ్రసంగ మేల? (ఇటు నటు చూచి) ఆఁ ఆఁ ఇచట దాచి యెఱుంగనట్లు నటించెదవా (అని శివలింగముచాటున (నున్న మోహినిని బట్టుకొన నామె విష్ణురూపమున నిలుచును.)

విష్ణు:—(మందహాసముతో) పూబోడులుచాలక పురుషులగూడ బట్టుచున్నా వేమిచిత్రమయ్యా! మహానుభావా!

శంక:—(వెలవెలవోవుచు నిలుచును.)

విష్ణు:—అటులు వెలవెలవోవుచు నిశ్చలముగ జూచెదవేమి? నేను నారాయణుడను. నీ ప్రియమిత్రుడను. అంతరంగిక సఖుడను. ఇన్ని చెప్పినను నానవాలు పట్టలేనియవస్థలో నున్నావే.

శంక:—(తలవంచి) ఈ మాయానాటక మంతయు నీ వాడినదేనా? ఎంతగ నాయాసము గల్గించితి వోయి! బావా! ఆడుగూపు గైకొన నాసక్తి గల్గినదా?

విష్ణు:—చెలికాని చిన్నతనపుజేతల మన్నింపకపో వని యింతసాహసించితిని. నీ వర్ధకాంతవు, నేను పూర్ణకాంతను, నీయర్ధనారీత్వము సుస్థిరము, నాపూర్ణనారీత్వము తాత్కాలికము.

శంక:—(నిట్టూర్పుతో) ఎంతగ వేగించితి వోయి! శౌరీ! నీ వాజగన్మోహినీరూపముతోడనే శాశ్వతబ్రహ్మకల్పముగా నుండిన బాగుగనుండు నే.

విష్ణు:—ఓహో! నీవు పడినపాటు లింకను చాలవా?

శంక:—కష్టములకేమి లెమ్ము. కాత్యాయనితో బాటుగ నిన్ను నుగైలాసమహారాజ్ఞీమణిని గావించియే యుందును.

విష్ణు:—ఏమో! పరమేశ్వరసంకల్ప మటు లున్నది గాబోలును. సర్వమంగళకు సవతిని సమకూర్ప సంకల్పించితివి గాబోలును. మహాత్ముల మాటలకు మాఱు లేదుకదా!

(నేపథ్యమున) తథాస్తు.

శంక:—ఎవ్వరు వారు? బావా! నీ మాటకు "తథా స్తనుచు నుపశ్రుతిని గల్పించువారు.

(అంతట భృంగి ప్రవేశించి వెలవెలవోవుచు నిలుచును.)

శంక:—భృంగీ! ఇపుడు తథా స్తని దీవించినవా రెవ్వరు?

భృంగి:—నారదమానీంద్రులు.

భగీ:—నాగదమునీంద్రులా! నాకు నాపూర్వులకును తరణోపాయము పదేశించిన పరమకారుణ్యాసాగరులారా! ఏరీ? (సంభ్రమించును)

భృంగి:—లేరు. హరిహరదేవుల యునికి నా కెఱిగించి యచటినుండియే నవ్వుకొనుచు వడివడిగ నడచిపోయినారు.

విష్ణు:—నాదరమౌని వదనమునుండి తథా స్తనుదీవన యేసందర్భమున జారిన దని యడుగుచుండ నేదేదియో చెప్పెద వేమి? భృంగీ!

శంక:—విషయమును విడిచి భాషించుట వీనికి పరిపాటి యైపోయినది.

భృంగి:—మనవిచేయు చుంటిని గాదా. త్రిలోకసదాసంచారులు గావున మా యుమానాథునిజాడ దెలుపుడని వారిని యాచించితిని. దానికి వారు మౌనులుగాన మౌనమే సమాధానముగ నొసంగిరి. "పో నిందు మా యయ్యగారి దర్శనము నాకు త్వరలో నగునట్లాశీర్వ దింపు డని వేడగ వారు "తథాస్తు"ని దీవించుచు మీాయునికి నెతీ గించి యరిగినారు.

శంక:—భృంగీ! నీవు వడిగ బరుగిడుచు బోయి నారదమహర్షి నిటకు దోడ్కొని రమ్ము. ఇది నారాయణదేవుని యాజ్ఞ యని చెప్పుము.

భృంగి:—(నిష్క్రమించి వెంటనే ప్రవేశించి) దేవా! వారు దయ చేయుచున్నారు.

భగీ:—ఆహా! ఏమి సుదినము! పుణ్యతీర్థము లన్నియు నొక్కచోటనే ప్రోబడుచున్నవి. ఇది నాభాగ్యవిశేషమే కాని వేరుగాదు.

విష్ణు:—వెలువడుచున్న మహర్షి వెనుకకు దిరిగె నేమి చెపుమా. అతని రాకలో నేదియో విశేష మున్నది.

భృంగి:—దేవా! కరిమ్మరి వచ్చుచున్నవారు నారదమునీంద్రులు గారు. కాంతాజనము.

శంక:—కాంతాజనమా! (చూచి) ఓహో-గంగాసహితముగా కాత్యా యని యిట కేతెంచుచున్నదే బావా! నారాయణా! నన్నిచటనే యుండు మందువా?

విష్ణు:—(నగుచు) నీవు లేకున్న నెట్లు? వరుడులేని వైవాహిక కార్యమా?

శంక:—(ఆశ్చర్యముతో) నీ యంగనాత్వ మంతరించినదిగదా. ఇంకను కల్యాణప్రశక్తి యెందులకు?

విష్ణు:—అబ్బా! ఎఱుగనివాడువోలె యెంత యమాయికత నటించు చున్నావు?

తే. గీ. దాత నేను; సదస్యుండౌ నీతపస్వి;
వాసిగాంచిన కైలాసవాసి వరుడు;
మంగళగుణాలవాల మాగంగ వధువు;
ఇంతకంటెను భాగ్య మింకేమి కలదు ?

శంక:—ఉమ చెవి నీ పలుకులు బడినయెడల యయ్యాగారిపస యపుడు బయలుపడును.

విష్ణు:—ఆమె నంగీకరింప జేయు భాగము నాయది. హరి కభిముఖముగ మనమే పోయి మోహినీశంకర నాటకమునకు మంగళహారతి గైకొందము రమ్ము.

భగీ:—(చేమోడ్పుతో) హరిహర దేవు లీయల్పసేవకు ననుగ్రహింపక యే దయచేయుచున్నారు. నా తపమున కింకను విముక్తి లేదా ?

విష్ణు:—భగీరథా! ఈపాటు లన్నియును నీకొఱకే కాదా?

భగీ:—ధన్యుడను.

శంక:—రాజర్షి! మాకంటెముందుగ నీ వేగి యార్యకు నమస్కరించి విషయమును వివరింపక యనుకూల మగునాశీర్వాదమును బడయుము. అనంతరవిధానమంతయు మా హరియే నిర్వర్తింపగలడు. పోయి రమ్ము. నీకు శుభ మగుగాక.

భగీ:—మహాప్రసాదము స్వామీ! మహాప్రసాదము.

(హరిహరభృంగులు నిష్క్రమింతురు.)

భగీ:—ఆహా! నా తపము నేటికి ఫలించినది.

శా. సంగాతంబు బలీయ మైనకతనన్ శౌరిం దుటారింపవే
కంగీకార మొసంగె శంకరుడు గంగాజ్ఞానవన్ మౌళిపై
సింగారింపగ; నామె సాగరులకున్ చేకూర్చెడున్ సద్గతుల్
పొంగుల్వారుచు భస్మరాశులపయిన్ పొల్పారగా బారుచున్.

(నిష్క్రమించును.)



## పంచమాంకము—ప్రథమరంగము

ప్రదేశము:—వైకుంఠము.

ప్రవేశము:—గంగ- పార్వతి.

విష్ణు:—(ప్రవేశించి గంగతో) అమ్మాయీ! గంగా! అన్నివిధముల నీకంటె బెద్దయగు నార్యామహాదేవియెదుట నీ వంతపరుషముగ బలికి యవినయమును జూపవచ్చునా ?

గంగ:—జనకా! కరుణామయి యగు కాత్యాయనీదేవి చెల్లెలిచిన్న తనపు దుడుకుదనమును సైరింపకపో దని నే నెఱుంగనా ?

విష్ణు:—ఏమిచెప్పినను సరియేకాని నోటిదురుసు నీకు చాల యున్న దమ్మా!

పార్వ:—అన్నా! ప్రవాహమందువలెనే పలుకులలోగూడ నీమెకు వేగ మున్నది. ఐనను నంతరంగ మతిశీతలమైనదని నే నెఱుగనా?

విష్ణు:—ఏమిటమ్మా గంగా! మీా వివాదాంశము ?

గంగ:—అక్కనారినే యడుగ రాదా ?

పార్వ:—నీవే చెప్పకూడదా యేమి? మన కిరువురకును గావలసిన వారు మధ్యవర్తిగ నున్నపుడు వివాదము బరిష్కరించుకొన గూడదా ?

గంగ:—నేను నోటియొట్టము గలదాన నని యీావఱకే పేరు వడసి తిని. నాకు చమత్కారముగ సాగదీసుకొనుచు మాటాడుపద్ధతి తెలియ దమ్మా! అందుచే నీవే చెప్పుము.

విష్ణు:—ఎవరు ముందుగ జెప్పిన నేమిపోవును? చిన్నదాని ముద్దు చెల్లించి నీవే చెప్పు మమ్మా పార్వతీ!

పార్వ:—చెప్పుట కేమున్నది? ఆనాడు నీవు జగన్మోహినివై మీా బావ గారిని తెయి తెక్కలాడించిననాటి విషాదఘట్టమునుగూర్చి-

విష్ణు:—ఊఁ హూఁ. ఆ విషయమై మీకును మీకును తగవు లెందులకు? అది నాతో సంబంధించినది.

పార్వ:—అది గాదు. అన్నా! మీ బావగారు హాలాహలజ్వాలలకు కామాగ్నిని దోడుచేసుకొని నిన్నతితీవ్రయాసముతో వెన్నాడుచు గంగాతీరమున గాఢమూర్ఛకు లోనైన యా యాపత్సమయమున నా యెండలో నానిరవలంబస్థితిలో నా మానస మెంతగ క్షోభించినదో నీ వెఱుగవా?

గంగ:—అట్టి దుస్థితికి నేనే కారణభూతురాలనా?

విష్ణు:—ఊరకొను మమ్మా! నీవు కారణ మని యీమె మాత్ర మనినదా? ఆ యక్షతల శిరమున ధరింపవలసినవాడను నేను. సోదరీ! కానిమ్ము.

పార్వ:—ఆస్థితిలో జటాజూటము చెదరి మొగమున నెల్లెడ నలము కొన నోడలెఱుంగక దీర్ఘనిశ్వాసములతో—దీనాననముతో—కారెండచే గాలిపోయిన గండ్రయిసుకలో నిలువున గూలిపోయి పొరలాడుచు గొంతవడికి తేరుకొని నీరమున్కై నోరు తెరచి సంజ్ఞామాత్రముచే సూచించుచుండ నెట్టికట్టడిపని గావించినదో వింటివా?

గంగ:—ఏమిచేసితిని? నీరమును స్వయముగ నొసగితిని. మూర్ఛనుండి ముక్తుని గావించితిని. ఇదియే నే నొనర్చిన యపరాధము.

పార్వ:—నీర మొసగితివా? నీవు నీర మొసగితివా? ఎంతబింకము ప్రదర్శించితివి! ఎంతగ బతిమాలించుకొంటివి. (విష్ణువుతో) అన్నా! బాగుగ వినుము. పుష్కలముగ నున్నజలప్రవాహము నీమె యంతర్ధాన మొనరించినది.

విష్ణు:—నిజమేనా? గంగా! సత్యమేనా? అంతర్హిత మొనరించితివా?

గంగ:—(తలవంచి) చేయలేదని చెప్పను. చేసితిని, అంతకుమున్నామె నన్నాడిపోసినందుల కాతీతి పరివర్తింపవలసివచ్చినది. తప్పైన క్షమింపవచ్చును.

పార్వ:—ప్రాతపగలు దీర్చుకొనుట కది తగినసమయమేనా? అందులకే కాబోలు నదను కనిపెట్టి యటు లోకనొక్కు నొక్కినావు. హోరున నేడ్పించినావు. పలుమారు బతిమాలించుకొనినావు. తుదకు కాళ్లుగూడ బట్టించుకొన్నావు. ఔను. నీకేమి? బాధ్యత నాది. పని నాది. అవసరము నాది. బాధపడుదానను నేను.

గంగ:—ఎంత కెంత చదువుచున్నదో చూచితివా? ఎన్ని నేరారోపణలో వినుచున్నావా? అనుము, అనుము. ప్రచారము చేయుము. గంగ కఠినురా లని, క్రూరురా లని, యెంతగ లోకమునకు చాటదలచితివో చాటుము. భవానీదేవిగారి ప్రౌఢవచనముల నమ్ముదురుగాని యమరగంగ యమాయికాలాపముల నాలకించువారెవ్వరు?

విష్ణు:—అబ్బా! ఒక్కయరగడియసే పూరకొను మమ్మా! నీవును చెప్పుదువుగాని— ఆఁ అపు డేమైన దమ్మా భవానీ!

పార్వ:—తోయమంతయు దిరోధాన మొనరించినతరువాత నేను యాచింపగ యాచింపగ— నాయదృష్టవశమున నీమె యంతరంగము కొంసంత కరగినది గాబోలును, ప్రవాహమును యథాపూర్వముగ బ్రత్యక్షము గావించినది.

గంగ:—ఇంతేకాని మఱి మనయంతరమున నింకేమిమాటలును జరుగలే దనుమాట. సత్యగోపనముగూడ యనృతము గాదుగాబోలును.

పార్వ:—మన కేమిమాటలు జరిగినవి. మనతమాల పరుగిడి జలమును సంగ్రహించుకొని రాకమున్నే నానాథుడు తేరుకొని లేచి మోహినీ నామస్మరణముతో బోయి మనదృష్టిపథము నతిక్రమించినాడుగదా.

విష్ణు:—గంగా! ఆవేదనసమయమున నచట జరిగినవిషయము లన్నియు నామెకు స్మృతికి రాకపోవచ్చును. అందువలన నీవే చెప్పిన తప్పేమి?

గంగ:—ఇన్ని బండ్లగ్రంథమును కంఠస్థము గావించుకొనిన యీ వివేకవతికి యొండు రెండుమాటల విస్మరించిన దన నెంతగ నమ్మవలెనో!

విష్ణు:—విసివింపక చెప్పు మమ్మా!

గంగ:—ఆమె వాదమును బాధించుపలుకులు- ఆమె కనుకూలము గానిపలుకులు- నవియన్నియు మఱపునకు రావా! ఏ మనినది? కలిగిన యైశ్వర్యమెల్ల ధారవోసెద నన్నది. కోరినకోరికల నెల్ల నెఱవేర్చెద ననినది. కైలాసనగ మెక్కించి కావలసినంత గౌరవ మొసగెద ననినది.

విష్ణు:—(నగుచు) కైలాసపర్వత మెక్కించెద ననుటకంటె కాంతుని శిర మెక్కించి ద్రొక్కించెద ననిన చక్కగ నుండునేమో. ఏ మమ్మా! చెల్లెలా! అంతటితో గాని బావగారిమత్తు వదలునా!

పార్వ:—ఔను. నేనుమాత్రి మామాటల ననలే దను చుంటినా! అనియేయుంటి నేమో.

గంగ:—"అంటిని" యని యపు డాడినమాట లపుడే "యేమో" లోనికి మారినవి గదా!

పార్వ:—ఆ యాందోళనపరిస్థితిలో నా యాపత్సమయములో నేమంటినో- యేమిచేసితినో- యేమి చూచితినో- నా కేమైన తెలిసినదా? సరియే, అంటి ననియే నిర్ధరింపుము. ఆ, ఐన నిపు డేమి?

గంగ:—ఏమియును లేదు. ఆ వాగ్దానము నిపుడు చెల్లింతు వని యాసించితిని.

పార్వ:—నీ విపుడు కోరున దేమి? ఐశ్వర్యమా?

గంగ:—కాదు, ఐశ్వర్యమును గాదు. ఈశ్వరునే. కైలాససామ్రాజ్యమును గాదు కాత్యాయనీనాథునే.

పార్వ:—(గుండెల బాదుకొని) అమ్మా- అమ్మా- ఎంతకైన తెగించిన యాడుదానవు. నా జీవితేశ్వరునే గోరితివా ? నా ప్రాణపదమునే కోరితివా ? ఉపవాసములచే మాడి మాడి- చిక్కి- చిక్కి- శల్యామాత్రావశిష్టనై కష్టించి గడించుకొనిన ప్రాణనాథునే కోరితివా? ఆయువుపట్టునే యంకించుకొన దలచితివా ?

గంగ:—నేనుమాత్రము శ్రమించి యపాయస్థితిలో నున్నయభవుని బ్రదికింపలేదా ? ఆతరి నేనే యడ్డుపడనిచో నీ నాథుడును నీవును నేమైయుందురో యెఱుగవా ?

విష్ణు:—సౌభాగ్యవతులారా ! మీలో సామర్థ్యము చాలక యొకతెయు, పట్టుదలచే వేరొకతెయు నామిథ్యాభర్తను గాపాడకపోయినచో నీ పోతుపేరటాలు చేతుల నలుపుకొనుచు నూరకుండు నను కొంటిరా? మి మ్మొకయాట నాడించుట కది కపటమూర్ఛగాని యంతటి మహోన్మన కా ప్రారబ్ధ మేమి ?

పార్వ:—(ఆలోచించి) గంగా! కడపటిమాట నొకటి చెప్పనున్నాను విను. మహోన్మని గోరుటకు నీ కధికారము లేదు.

గంగ:—ఎందువలన ? నీకు మాటనిలకడ లేకపోవుటచేతనా ?

పార్వ:—కాదు. నీ కాసమయమున నీవు చేయదలచిన యుపకారము చేయ నవసరము గలుగకపోవుటచేత. తెలిసినదా.

విష్ణు:—సోదరీ ! నీభావము నా కగోచరముగా నున్నది.

పార్వ:—అన్నా ! అనేకవరముల నొసంగెద నని పలికి యమరగంగ నంబువులకై యర్థించినమాట యథార్థమే. కాని యీయామె ప్రత్యక్షము గావించిన ప్రవాహముకడ కేగి మాతమాల జలమును సేకరించి రాకమున్నే మూర్ఛ వీడి నామనోహరుడు నిన్ననుసరించుటచే నేను యాచించిన యీయామె యీయ నియ్యకొనిన జలముతో బనిసక్తియే లేకుండ పోయినది. నా ప్రార్థనము నాకడనే యున్నది. ఆమెజల మామెకడనే యున్నది.

గంగ:—చూచితివా? చూచితివా? ఎంతయసందర్భముగ మాటలాడు చున్నదో వినుచున్నావా! చల్లని నాకరస్పర్శలచే మూర్ఛితుని మత్తు విడినదో- నీ వేడినిట్టూర్పులవలన తొలగినదో యీ ప్రాణేశ్వరునే యడిగి తెలిసికొనరాదా! ఎదుట నద్దమున్నది. ముఖమున్నది. చూచుకొనరాదా? ఏమి జనకా! ఏమి మాటలాడవేమి? మీ బావగారిని బిలువనంపి సాక్ష్యమును గైకొనరాదా?

విష్ణు:—ఏమమ్మా! పార్వతీ ఈ పనికి నీ వంగీకరింతువా?

పార్వ:—(కోపముతో గూడిన యుడుకుబోతుతనముతో)నాకే సాక్ష్యములును వలదు. నాకేసంపర్కమును నవసరములేదు. అదియుగాక మగనినొసగుటకు మగువకేమి యధికారమున్నది. ఇచ్చుటకిది యేమి యచేతనవస్తువా,నగలా, నాణెములా? నా తిరువురును నేకమే. నేనే సంబంధములేనిదాననై పోయితిని. బండియు నెద్దును నేకమైనపుడు కొండ లద్దునా! వారిజాక్షా! నాకేమియును వలదు. వారినే కాపురము చేసుకొననిమ్ము- వారినే కులుకనిమ్ము. వారినే సుఖింపనిమ్ము. నా యవివేకము బైటబడుటయే కాని వారికిని వారికిని మధ్యమున రాయబారములు సాగుచునే యున్నవట. అన్నియు నా చెవుల బడుచున్నవి.

విష్ణు:—చెల్లెలా! చెల్లెలా! అకారణముగ మనసును బాధచేసికొనుచున్నావు. నీయానతి లేదిదే- నీయనుగ్రహమునకు బాత్రురాలు కానిదే- నీవు ప్రసాదింపనిదే యీమె నీపతివైపు కన్నెత్తి కనుగొనగలదా! కాసంత పెదవి గదుపగలదా? అమరగంగ యవివేకమే కాని యింత యొడుదుడు కెందులకు? ఇన్నివరము లెందులకు? ఇన్ని పూర్వపక్షసిద్ధాంతము లెందులకు? అనుగరాదా? ధారాళముగ నెదుటబడియర్థింపరాదా? చేనువుచేసాధింపవచ్చునే- భక్తిచే బడయవచ్చునే- ఆరాధించి యీప్సింపవచ్చునే.

పార్వ:—అన్నగారి యాలాపములలో పుత్రికాభిమానము పూర్ణముగ పుంజీభవించుచున్నదే.

గంగ:—(శాంతముగ) అక్కా! నన్ను మన్నింపుము. నా యవివేక మును మనసున నుంచుకొనకుము. శైలరాజకుమారికి సవతి నని పించుకొని సంతసింపదలచితిని గాని నీ వింత కోపింతు వని యెఱిగి నచో నోరెత్తి యుందునా?

పార్వ:—కోరరానిది కోరుట కోపకారణము గాదా?

గంగ:—ప్రియుని ప్రీతికి భిన్నముగా వర్తించుట నీకు మాత్రము న్యాయమా?

పార్వ:—సతీధర్మము లుపదేశించి నన్ను నీవు సంస్కరింపనక్కర లేదు.

గంగ:—అటులైన నిరర్థకముగ- నిష్ప్రయోజనముగ- నిరుత్సాహ ముగ రిక్తహస్తములతో నన్ను బంపివేయుదువా? ఇది నీకు భావ్య మనియే తోచినదా?

పార్వ:—రమ్మనుటకును పొమ్మనుటకును నేనెవతెను? అటు నామహా రసికశిఖామణియు- నిటు వగలాడివి నీవును నున్నారు.

విష్ణు:—అదెగో- అటు చూడుడు. ఆవంక చూడుడు. మాశంకరదేవు డస్తిమితమానసుడై యటునిటు తిరుగుచున్నా డేమి? రండు.

(అందరును లేచి నిష్క్రమింతురు.)

## పంచమాంకము—ద్వితీయరంగము

ప్రదేశము:—కైలాసము.

ప్రవేశము:—శంకరుడు- పార్వతి- భగీరథుడు.

శంక:—భగీరథా! నిన్నిచటికే రావించినకారణ మిప్పుడైన బోధ పడినదా?

భ:—చిత్రము. మహాదేవా! చిత్రము. ఇం కెందులకు? నన్ననుగ్రహించుటకే నా పూర్వుల దరింపజేయుటకే.

శంక:—ఇట చూడుము భగీరథా! నీవు వృధాశ్రమ నందితివిగాని, గంగను నన్నును ప్రార్థింపక యాదియం దార్యాదేవినే యారాధించియున్నచో నీవటకే నీకు కార్యసాఫల్యమై యుండెడిదిసుమా.

పార్వ:—భగీరథుని మాటకేమిగాని- ముందుగ మీముచ్చట తీరియుండును.

భగీ:—తల్లీ! ఎంద అనుగ్రహింపనిదే యీ మీ తనయునికోరిక లీడేరును?

శంక:—సమయమునకు నాసఖుడు నారాయణు డిటనుండి చల్లగ జాఱిపోయినాడే.

పార్వ:—మా వైకుంఠునితో మీ కింకేమిపని యున్నది? ఎదుట నీసమయమునగూడ నున్నయెడల మునుపటి మోహిని స్మృతికి వచ్చి మా చెల్లెలిపై మమకారము క్షీణించునేమో యని భయమంది వెడలియుండును. నాథా! గంగావతరణకాల మాసన్నమైనటు లున్నది. కపర్దము నించుక గట్టిగ బిగించుకొనరాదా?

శంక:—ఆదేశించుటయేకాని యా పాటిసాయము నార్యామహాదేవి చేయగూడదా?

పార్వ:—(నవ్వుచు) జీవితేశా! మందాకినిని శిరముననే ధరింపవలయునా? కరమున గ్రహింపరాదా?

శంక:—దేవీ! నీ యానతితోబాటుగ నామెనుగూడ శిరసావహింపవలయునేమో! జటాజూట మొకసరసివలె నుండును. దానిలో గంగ యిమిడి యుండగలదు, కరమున గ్రహించి యెంతకాలమటు లుండు మనెదవు?

పార్వ:—(నగుచు) ఆర్యుని యభిరుచిని నే నేల కాదనవలయును?

శంక:—నా యభిరుచియే కాని యార్యాదేవి యానతి కాదేమి? దేవీ! నీకిది కోపకారణ మగునని భీతి నంది యీ పనినుండి విముఖుడనై నిశ్చలముగ గూర్చుండియుండ మగల నా కీర్తిపెండిలికూతురును నెత్తి బెట్టుచున్నావేమి?

పార్వ:—దేవరవారికి తెలియని నూతనహేతువు లేమున్నవి? ఒకటి మా మందాకిని కానాడు నోరుజారి యొసగినవరము. రెండవది-నమస్కరించిన యీ రాజర్షిని "యభీష్టసిద్ధి రస్తు"ని యభ్యాస వశమున నాశీర్వదించితిని కావున దానిని పాలింపవలసినబాధ్యత-మూడవది మా రాజీవలోచనుని మాటలపై గల మహాగౌరవము. నాలుగవది మీ కాలకూటకబళనముచే గల్గినపైత్యమును శమింప జేయ నశ్వినీదేవత లాదేశించిన జలచికిత్స- ఐదవది యార్యాన కానాడు జయంతజన్మదినోత్సవసమయమున సంకురించి యభివృద్ధి నంది యంటివిడువని యనురాగభారము. ఇంకను కారణములు గావలయునా?

శంక:—ఎన్నియున్నను సర్వమంగళ సమ్మతింపనిచో నన్నియు దూది పింజలవలె తూలిపోవలసినవే కాదా? దేవీ?

తే. గీ. అతిచతురవైన నీసహాయంబు లేక
యెట్టిపనినైన నే నిర్వహింపగలనె?
కడకు బ్రహ్మంబె తా మాయ గలియకున్న
జీవకోటులనెల్ల సృష్టింపగలడె?

ఏమి భగీరథా! అంతే కాదా!

భగీ:—దేవాదిదేవుని పలుకుకంటె పరమసిద్ధాంత మే మున్నది? చేతులు రెండును గలిసినపుడే నమస్కారచిహ్నమై ఫలమును గల్పించుకొనుట లేదా!

పార్వ:—పూజ్యు లగు బృహస్పతిమహాశయులు గంగావతరణమున కుంచినసుముహూర్తము సమీపించినటు లున్నదే.

(నేపథ్యమున గంట మ్రోగును.)

(అంతట వనితారూపమున మందాకిని యవతరించును.)

భగీ:—(ముకుళితకరుడై) భగవతీ! గంగాకల్లోలినీమతల్లీ! ధన్యోఽస్మి ధన్యోఽస్మి.

దండకము:-జయ! జయ! జయ! మహాదేవి! నీహారభూమీధరాధీశ కన్యాసపత్నీమణే! శౌరిపాదోద్భవే! నిర్మలాలోలవీచీ సమాఘట్టనాశావితేశానమౌళీందుబాలే! జగజ్జాలసంపూజితే! పాహి మాం మేహి నాకం మయా, దేహి మే తావకీనం ప్రసాదం, మదీయాఖిలానాం పితౄణాం శ్మశానే చరంతీ, కిరంతీ దయాలోకనాసారసారం, ప్రసీదోత్తమాం సద్గతిం దివ్యగంగే! నమస్తే నమస్తే నమస్తే నమః.

(తెర వ్రాలును.)

(మరల తెర నెత్తగ శిరమందు దాల్చినగంగతో శంకరుడు గన్పడును.)

శంక:—రాజర్షి శిరోమణీ! అవనిపై నించుక గంగాజలధారను విడిచెదను. అది నిన్ను పురస్కరించుకొని మీ సాగరుల శ్మశానావని బ్రవహించి కృతార్థుల గావింపగలదు.

భగీ:—మహాప్రసాదము తండ్రీ!

శంక:—ఇక నిచట యాచరణీయ మేమి?

:—ఏమున్నది? మహానుభావా! మా బాంధవులనే కాక భరతఖండ మంతటిని పవిత్రీకరింపనున్న పరమపావనిని గంగాభవానిని నాశాసించి యవనీతలమున కనుపుటయే కాక మ రేమున్నది?

శంక:—(ఆనందపూర్వకముగా)

సీ. అవనీతలంబు సస్యాకీర్ణ మగుగాక
గంగాప్రవాహమే కారణముగ
కలుషసంచయము ప్రక్షాళింపబడుగాక
వారి మున్గిన నెల్ల వారిచేత
అపుడే గ్రహించినయట్లు భాసిలుగాక
నీ రెంతకాలంబు నిలువయున్న
ఉరుకవితాధార యుపమింపబడుగాక
విమలపరీవాహవేగమునకు

తే. గీ. స్వార్థమును వీడి పితృగతిప్రాప్తి గోరి
చిరము తపియించి ధరకు దెచ్చితివి గాన
సౌరవాహిని కింక "భాగీరథి" యను
పేరు సార్థక మగుచు పెంపారుగాక !

పార్వ:—తథాస్తు.

గద్య: — ఇది శ్రీహరిహర దేవకరుణాపాంగవిశేషసమాసాదితో భయభాషాకవితా రచనానిపుణ, కాకరపర్త్యుపనామక కాశ్యపస గోత్రోద్భవ, బావనార్య భిషఙ్మణిపౌత్ర వేంకమాంబా వేంకట రాయమనీషిపుత్ర కవికంఠీరవీ కవిమూర్ధన్య ప్రౌఢకవిచందాది బిరుదాంకిత కృష్ణశాస్త్రినామధేయ ప్రణీతంబైన గగనగంగ యను నాటకంబున సర్వమును సంపూర్ణము.



హరిహరదేవాయ నమః

# గగన గంగ




ర చ యి త :

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,

బ్రాహ్మీభూషణ

కాకరపర్తి కృష్ణశాస్త్రి


 [ మూల్యము రు 1-50 లు.

## — స్త్రీ పురుష పాత్రలు —



### పురుషులు

1. శంకరుఁడు ............... కైలాసాధిపతి
2. విష్ణువు ................. వైకుంఠనిలయుఁడు
3. బృహస్పతి ............... దేవగురువు
4. భృంగి .................... శంకరుని యనుచరుఁడు
5. భగీరథుఁడు............... రాజర్షి
6. కరాళుఁడు, దమనకుఁడు ... దానవభటులు

### స్త్రీలు

1. పార్వతి ................... శంకరుని భార్య
2. గంగ ....................... శంకరుని ద్వితీయపత్ని
3. జగన్మోహిని ............... స్త్రీరూపియగు విష్ణువు
4. తమాల .................... పార్వతి చెలికత్తె



హరిహరదేవాయనమః

# గగన గంగ

## ( నాంది )

( సూత్రధారుఁడు ప్రవేశించి )

ఆ. వె. అంబుజాంబకుఁడు సితామలదేహుం డ
హీనమణివిరాజమానగళుఁడు
శంకరుం డశేషసద్భక్తవరదుండు
మనుచుగాత మిమ్ము మాధవుండు.

(అంజలి గత పుష్పముల ప్రేక్షకులపై జల్లును. )

నటి:-( ప్రవేశించి ) నాథా ! ప్రదర్శింపబోవు నీ నాటకనామమేమి ? రచయితృ నామ మేమి ?

సూత్ర:-

కం. కవికంఠీరవ విద్వ
త్కవివరప్రౌఢకవిచంద్ర కవిమూర్ధన్య
ప్రవిమలబిరుదాంకిత కృ
ష్ణవిరచితము గగనగంగ నాటకము నటీ!

నటి:- ఓహో! ఇందలి కథానకము గంగావతరణ మేనా ?

సూత్ర:- అగును.

నటి:- మీ రిపుడు గాన మొనర్చిన నాందీపద్యము హరిహరులలో నెరిని గూర్చి ?

సూత్ర:- ఉభయుల సంప్రార్థనము నం దున్నది. నాటకకర్త హరిహర దేవభక్తుఁడు, సర్వమతసామరస్యముగల యద్వైతజ్ఞానవంతుఁడు. పరస్పరమతద్వేషులగు హరిహారాధకు లాపద్యమును నైజ మతానుసారముగ పదవిభజనము గావించుకొని సంతృప్తినంద

వచ్చును. అదియునుగాక యీ గగనగంగానాటకమున హరిహరులు పాత్రలు గదా ?

నటి:- నాథా ! మీ సంప్రార్థనపద్యము సహేతుకము, నామోదకరమునై యున్నదిసుడీ-

( నేపథ్యమున )

"నీవు నూరుచెప్పుము. వేయిచెప్పుము."

సూత్ర:- అదెగో- మననటు లతిత్వరితగతి నాటక మారంభించినారు- ఇది రసవంతమాటచే గాబోలు ప్రియా ! లోనికేగుదము- నడువుము.

(నటీ సూత్రధారులు నిష్క్రమింతురు.)

( యవనిక జారును. )

ఇది నాందీ ప్రస్తావనము.



# గ్రంథస్వీకారము:—సమీక్ష

—శ్రీ బండారు తమ్మయ్య.

1. శ్రీ కేతకీసంగమేశ్వర మాహాత్మ్యము:- కర్త- శ్రీకొమ్మిరెడ్డిపల్లి తిమ్మయ్యకవి. మెదకుమండల రచయితల సంఘము (కోహీరు, ఆంధ్రప్రదేశము) వారి 5 వ నెంబరు ప్రచురణము క్రౌను పుటలు 68. వెల రు 1-50 లు.

2. శ్రీ మత్కొల్పోలు ఉమాసంగమేశ్వర సుప్రభాతము :- కర్త- శ్రీ బి. అనంతరాజశర్మగారు, శంకరంపేట. ఆందోలు తాలూకా, మెదకుజిల్లా. క్రౌను పుటలు 20. వెల రు 0-50 లు.

1. ఇదియొక అపూర్వపద్యకావ్యము. ఇందు మూఁడాశ్వాసములు గలవు. గద్యపద్యాత్మకము. కృతికర్త తిమ్మయకవి యెప్పటివాఁడో సరిగా నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లేవు. రెండు వందలయేండ్ల క్రిందటివాఁడు కావచ్చును. దీని వ్రాఁతప్రతి యొకటి తన బంధువులు శ్రీమునగాల భద్రయ్యగారియొద్ద సంగ్రహించి, మెదకుజిల్లా ఆందోలు తాలూకా, డాకూరు వాస్తవ్యులు శివశ్రీ నురంసిద్ధి వీరయ్యగారు (చిరకాలము నిజాముప్రభుత్వము కొలువులోఁ బ్రాథమికపాఠశాలాప్రధానోపాధ్యాయులుగాఁ బనిచేసి తెలంగాణములోఁ బలువురు విద్యార్థులకు విద్యాదాన మొసంగుటలో జీవితము గడపి ఆ ప్రాంత మందలి నేటి యువకవులకుఁ బండితులకు, ఉద్యోగులకు గురువర్యులుగా నుండి వారిని దీర్చిదిద్దిన మహనీయులు పయిఁగా నా యందు విశేషప్రేమ వాత్సల్యములుగల పూజనీయులు) తాము సేకరించిన యా వ్రాఁతప్రతిని నా చేతఁ బరిష్కరింపఁ జేసి, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి, హైదరాబాదువారి ధనసాహాయ్యముతో ముద్రించి ప్రకటించియున్నారు.

దీనిని రచించిన తిమ్మయకవి కవితనుబట్టి చూచిన నంత విశుద్ధ పాండితి గలవాఁడుగఁ దోఁచఁడు. అట్లని కేవల మప్రౌఢుఁ డనియుఁ

జెప్పరాదు. అందందు ఛందోవ్యాకరణ దోషములున్నను సరళమగు, లలితకవితాధారతో కావ్యరచనము గావించినవాఁడు.

పవిత్ర శివక్షేత్రమాహాత్మ్య వర్ణనాత్మకములగు కావ్యములలో నొకటిగ దీనిని సంభావింపవచ్చును. ఇందు వర్ణితమైన సంగమేశ్వర తీర్థమే నదీనదముల సంగమస్థలము (కూడలి) కాదు. ఇది మెదకుజిల్లాలో హైదరాబాదునుండి బీదరుపోవు మార్గమున, జహీరాబాదున కెనిమిదిమైళ్ళ దూరములో నున్నది. మహాశివరాత్రి కేటేట నిచ్చట నుత్సవములు పెక్కు శైవక్షేత్రములలో వలెనే మహావైభవోపేతముగ జరుగును. విశేషమహిమాన్వితమయిన పుణ్యతీర్థమగుటచే సంవత్సరము పొడవునను ఆషాఢ భాద్రపద పుష్యమాసములలోఁ దప్ప దక్కిన మాసములం దాంధ్రకర్ణాటక మహారాష్ట్రదేశములనుండి యాత్రికు లసంఖ్యాకములుగ నరుదెంచి యిచ్చటి సంగమేశ్వరస్వామిని సేవించుచుందురు. ఈ క్షేత్రమున అమృతకుండమను పేరికుండ మొకటి యున్నదఁట. దానిమధ్యమున బాణలింగాకృతితో శివుఁ డావిర్భవింప, బ్రహ్మదేవుఁడు గంగాగోదావర్యాది పుణ్యనదీతీర్థములఁ దెచ్చి యాస్వామి నభిషేకించి సేవించినాఁడట. పలువురు దేవతలు, మహర్షులు నిచ్చటఁ దపమాచరించి ఫలసిద్ధిని గాంచిరట. పెక్కురు దేవతలు, సమావేశమయిన కారణమున దీనికి "దేవర సంగ" మను వ్యవహారము, స్వామికి "దేవర"యను వ్యవహారము గూడ నేర్పడెనని తెలియుచున్నది.

"నాక్షతై రర్చయేద్విష్ణుం న కేతక్యా సదాశివం దూర్వాభిర్నార్చయే ద్దుర్గామతుల స్యాగణాధిపమ్" అను పురాణోక్తిచే శివారాధనమునకు కేతకి(మొగలిపువ్వు)పనికిరాదనునిషేధమున్నది.అట్లయ్యు భారతదేశమున నేశివక్షేత్రమునందును గానరాని కేతకీపుష్పములతోడి పూజ ఈ క్షేత్రమున సనాతనముగఁ జరుగుచుండుటయు, కేతకీవన మచ్చటఁ బ్రబలియుండుటయు నొకవిశేషము. ఆధిక్యవిషయమున

బ్రహ్మావిష్ణువు లిరువురకుఁ గలిగిన కలహ సందర్భమునఁ బరమేశ్వరుఁడు శివుఁడు జ్యోతిర్లింగాకృతి నావిర్భవించి దాని యాద్యంతముల నరసివచ్చినవారి యాధిక్యము నిర్ణయింతునని యాదేశింప, విష్ణువు అధోలోకములకు, బ్రహ్మ యూర్ధ్వలోకములకు నిజవాహనారూఢులయి పోవుటయు, విష్ణువు విఫలుఁడయి తిరిగివచ్చి తన యసమర్థతను శివునకు నివేదించుటయు, బ్రహ్మ తానా లింగముయొక్క శిఖరమును గాంచి వచ్చితినని యసత్యమాడు సందర్భమునఁ గేతకీపుష్పముచేఁ గూటసాక్ష్యమిప్పించుటయు శివుఁ డా యపరాధమున కాగ్రహించి కేతకీపుష్పమునకు శివపూజానర్హ మగు మని శాపమిచ్చుటయు నిత్యాది కథలు శివపురాణములలోఁ గాననగును. అయినను గేత కీ పుష్ప మీా పవిత్రక్షేత్రమునఁ దన యపరాధశాంతికై దీర్ఘ తపశ్చరణ మొనర్ప శివుడు ప్రత్యక్షమై దాని నాదరించి, ఈక్షేత్రమున మాత్రము నీ పూజ నంగీకరింతునని వర మొసంగి యచ్చటి కేతకీవనమున వెలసెనని యీా క్షేత్ర మహత్త్వమున వర్ణితమయినది. ఇందుచేతనే క్షేత్రమునకుఁగూడఁ గేతకీసంగమేశ్వర మనుప్రసిద్ధి యేర్పడియుండును. దేని యాధారమునఁ దా నీకావ్యము రచించెనో కవి విస్పష్టముగ వివరింపలేదు.

బ్రహ్మాండపురాణములో 1. క్షేత్రమహిమ, 2. అమృతకుండ మాహాత్మ్యము, 3. శివబ్రహ్మసంవాదము, 4. కేతకీశాపవిమోచనము, 5. అష్టతీర్థవర్ణనము అను నయిదధ్యాయములలో నీ క్షేత్రమహిమ హరిశ్చంద్రనృపాల సూత సంయమి సంవాదరూపకముగ వర్ణితమయినదఁట. "బహునాత్రికి ముక్తేననా స్తి బ్రహ్మాండగోళకే- సంగమ క్షేత్ర సదృశం ఈప్సితార్థ ప్రదాయకం" భూవలయములోఁ గామితముల నొసంగు క్షేత్రమిట్టిది వేఱొకటి లేదని యతివేలముగ వర్ణింపబడినది. కావున బ్రహ్మాండ పురాణమందలి కథను బట్టియే కవి దీనిని వ్రాసియుండునని తలంపవచ్చును.

పూర్వకాలమున సూర్యవంశజుఁడు కుపేంద్రుఁడను రాజు కాశ్మీర దేశమున శృంగారపురమును పరిపాలించుచుండెను. అతని సతి చంద్రికళాదేవి. కొన్నాళ్ళ కా నరపాలుఁడు పూర్వజన్మ కర్మఫలితముగఁ గాఁబోలుపరిబలకుష్ఠరోగపీడితుఁడయ్యెను.ఎన్ని మందులు సేవించినను, ఎన్ని తీర్థముల కేఁగినను, ఎన్ని దానము లాచరించినను-ఫలము లేకుండెను.ఆతని శరీరమునుండి పురుగులుకూడఁ బయలు దేఱెను. ఒకనాఁడాతఁడు గుఱ్ఱము నెక్కి వేఁటకయి యడవి కేఁగి యందొక హరిణమును గాంచి దానివెంట నశ్వమును బరువెత్తింపఁగా నది కేతకీవనమునందలి సంగమక్షేత్రమునందదృశ్యమయ్యెను. వేట బడలికచే రాజు గుఱ్ఱమును దిగి పిపాసాపీడితుఁ డవుటచే నచ్చటి యమృతకుండమందలి నీరమును గ్రోలి పాదప్రక్షాళనాదికము లొనర్చుకొని యింటికి మరలెను. ఆతని కరపాదములందలి కుష్ఠు మాయమైయుంటఁ గాంచి యందుఁగూర్చి భార్య ప్రశ్నింప నాతఁడు జరిగిన వృత్తాంతము నివేదించెను. పిమ్మట నాతఁడు భార్యా పరివారసమేతముగ నా క్షేత్రమున కేఁగి యమృతకుండమున స్నానాదికములఁ గావించి సంగమేశ్వరస్వామిని సేవింప నా వ్యాధి పూర్ణముగా నిర్మూలమయి యారోగ్యవంతుఁ డయ్యెను. ఇత్యాది మహిమలతో విలసిల్లు నీ క్షేత్రమహాత్త్వ మెల్లరుఁ బఠింపఁ దగినది. మెదకుమండల రచయితల సంఘ ప్రధానకార్యదర్శి శ్రీమాన్ ఎం. రంగకృష్ణమాచార్యులగారి నివేదనము, శివశ్రీ పెరవలి లింగయ్య శాస్త్రి వర్యుల శుభాశంశనము గ్రంథారంభమున ముద్రితములయినవి. అవిగూడ నవశ్యముగఁ బఠింపఁదగినవి.

మచ్చునకు గొన్ని పద్యములు మాత్ర ముదాహృతములు.

క. పూజించి యిష్టమగు స
దోభ్జనములఁ దృప్తిఁజేసి మోదముతోడన్
భూజాని హస్తమును మో
డ్చి జాగిలిమ్రొక్కి వారికిట్లని పలికెన్. (ఆ 1 ప 21)

( ఇందలి "మోడ్చి" ప్రయోగము ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర శతకమందలి, రోసీ, పాసీ, కోసి, చేసీల వంటిదిగఁ దోఁచును. నాల్గవ పాద

మందలి యతి దుష్టము. "ఢ్బీ" అను అక్షరమునకు, ఇట్లనియెను. ఏడవ గణము మొదటి యక్షరము "హిక్కి" తో యతి యెట్లు చెల్లును? )

శా. గంగాసాగర సంగమంబునకు వేగంబేఁగి సంతోష ము
ప్పొంగన్ స్నానముఁజేయు పుణ్యద్విగుణంబుం జేయు
రాజేంద్ర బల్ !
శృంగారంబున సంగమంబున విరించీకుండ మధ్యంబులో
నం గావించిన మజ్జనంబును మహీనాథాగ్ర గణ్యోత్తమా
(ఆ 1 ప 45)

ఉ. స్నానము సేయఁగా వెడలె సంతస మొప్పఁగ నుపేంద్రుఁడున్ నిజా
జ్ఞానసఁ గూడిఘోటక గజావళిపై ఘనభేరి భాంకృతి
ధ్వానములం జెలంగఁగఁ బ్రిథావసు బాంధవకోటితోడఁ దా
మానుగఁ బోయి కాంచెఁ బవ మానజలాంబుజమైన దీర్ఘికన్.
(ఆ 2 ప 61)

కవి యాశ్వాసాంత్యగద్యలందుఁ దాను "శ్రీమద్వేంకటేశ్వరప్రసాద లబ్ధ కవితావిచిత్రి కాశ్యపగోత్రుఁడ" నని వర్ణించికొనినను, ఈకావ్యమును కేతకీసంగమేశ్వరునకే యంకిత మొనర్చి హరిహరాద్వైతమును ప్రదర్శించుట ముదావహము.

2. కేతకీసంగమేశ్వర క్షేత్రమువలెనే, శ్రీమత్కొండాపూరులు ఉమాసంగమేశ్వర క్షేత్రమనెడి మఱియొక పుణ్యక్షేత్రము. తెలంగాణములో నున్నది. అదియు మహిమాన్విత మయినది. సనాతన సదాచారాచరణ చతురులు, బ్రహ్మచర్య నిష్ఠులునగు బ్రహ్మశ్రీ రావికోటు లక్ష్మీనారాయణశాస్త్రిగారను పుణ్యాత్ములీ క్షేత్రమున ప్లవంగ వత్సర మహాశివరాత్రి పుణ్యదినమున శివకోటి రుద్రయాగమును భక్తుల సాహాయ్యముతో నిర్వహించిరి. ఆసమయమున వారి ప్రోత్సాహమున గ్రంథకర్త శ్రీ అనంతరాజశర్మగారి సుప్రభాతస్తోత్రమును రచించి సమర్పించిరి. వీరుకూడఁ బైనిపేర్కొనిన మఠంసిద్ధి వీరయ్యగారి శిష్యకోటికి చెందినవారే. ఇందు సుప్రభాతమను పేరుతో 26 పద్యములుమత్తేభ శార్దూలవృత్తములతో ప్రచురితములైనవి యారంభమున

ముద్రితమయినను ఈ సంగమేశ్వరస్తోత్రమును, సంగమేశ్వరమంగళా శాసనమును, లాలిపాట, జోలపాట, ఆరతి- మంగళహారతి, ఉమా సంగమేశ్వర దండకము ప్రాతస్స్మరణ. సంగమేశ్వర భుజంగప్రయాతాష్టకము అను పేర్లతో నితర కవిరచిత స్తోత్రములుగూడఁగొన్ని చేర్చఁబడినవి. అన్నియు భక్తిభరితములు. భక్తులకిది ఉపయుక్తమగు సత్కృతి.

మచ్చునకుఁగొన్ని పద్యములు మాత్రి ముదాహృతములు.

సుప్రభాతమునుండి -

శా. ఆదిత్యుం డుదయించె నీసరసులం దబ్జజంబులు న్విచ్చె నా
మోదించున్ ద్విజపంక్తు లన్నిదెసలన్ మోదధ్వనుల్ నించె నీ
భూదేవుల్ శుభకాంక్షులై నిలిచిరో భూతేశ! నీ సన్నిధిన్
కాదే నీ కిది సుప్రభాత మగుచున్ గారుణ్య పాథోనిధీ.

మ. ఎటనే వేళల వచ్చునో తెలియరా దెవ్వారికేన్ వారి వ
చ్చుట గుర్తింపఁదలంచి పాదమిడినన్ జొత్తెంచు నీ రందులో
నిటు లాజాహ్నవి రాక నీక తెలియున్ హేలావిలాసమ్ములున్
నిటలాక్షా! యిది సుప్రభాతమగుతన్ నీ కభ్రగంగాధరా.

స్తోత్రమునుండి -

మ. అపకాలమ్మున లోకసంక్షయ కరంబైనట్టి హాలాహలం
బుపలక్షించి సురాసురుల్ చకితులై యుండన్ ద్వరన్ దద్విషం
బపకర్షించుట నీదుకంధర నభిఖ్యంబొందెఁ గల్మాషమేన్
గృపలోకాలను బ్రోచు నీకిదితగున్ శ్రీ సంగమేశప్రభో!

ప్రాతస్స్మరణనుండి:-

ప్రాతస్స్మరామి భవసాగర తారణైకం
భక్తార్తి దుర్మదవినాశకరం సుహేశం
భావాభిపూరణ పటుంభజతాం భవంచ
కొప్పోలుగారుడనదీస్థిత సంగమేశం.

అస్యార్థః దిఙ్ముఖకోణం విదిఙ్ముఖకోణకం చ ద్వే చతురశ్రచక్రే వ్యత్యయీకృతే విలిఖ్య తస్య బహిరంతశ్చ మండలరేఖాయుగం విలిఖ్య ప్రత్యేక మష్టకోష్టఘటితం విధాయ బహిర్మండలే పూర్వార్ధస్య అశిష్టాక్షరాణి చ క్రమా ద్విలిఖ్య అర్ధద్వయస్య శిష్టాక్షరాష్టకం మండలద్వయ మధ్యాష్టకోణేషు విలిఖేత్. ఏవం ద్విచతుష్కకోణవిశిష్టత్వాదస్య చక్రస్య ద్విచతుష్కచక్రసంజ్ఞా సూర్యరాయమహారాజ సర్వసర్వంసహాధిప సూర్యరాజమతే రాజ్యం సదా సరసబోధితం ఇతి పదచ్ఛేదః. హే సూర్యరాయ మహారాజ హే సర్వసర్వంసహాధిప హే సార్వభౌమ సూరస్య సూర్యస్య రాజ్ఞ శ్చంద్రస్య చ మా ప్రకాశ ఇన మా యస్య తస్య సంబుద్ధిః. తే తవ రాజ్యం సదా నిత్యం సరసబోధితం సంజాతసరసబోధం త దస్య సంజాత మితీతచ్ప్రత్యయః. త్వత్పరిపాలనచాతురీమహిమ్నా సర్వేషా మపి సరసత్వా దితి భావః. యద్వా సరస స్సువర్ణః బోధః ప్రకాశః శేషః. ప్రాగ్వత్ సర్వమపి రాజ్యం సువర్ణపుష్ట మితి భావః. ధ్వనౌ సువర్ణే నిర్యాసే బ్రహ్మణీతి రసశబ్దార్థనిరూపణే విశ్వః




శరబంధ ముదాహరతి సూర్యేతి. లక్షణం తు యత్రార్ధయో శ్చతుర్వర్ణా ఆదా వంతే పున స్త్రయః మధ్యే శ్లిష్టా శ్చతు ర్యుగ్మా శ్శరబంధోఽయ ముచ్యతే. రేఖాద్వయేనకోష్టచతుష్టయఘటితా మేకాం పంక్తి ముత్పాద్య తత్రపూర్వోత్తరార్ధయో రాద్యాక్షరచతుష్టయం శ్లిష్టం క్రమేణ విలిఖ్యం. తతః పరం తాం పంక్తిం ద్విధాకృత్వా ఏకైకకోష్టఘటితయో స్తయో రశ్లిష్టపంచమ మవర్ణా న్విన్యస్య పునరేకీకృత్య తత్ర శ్లిష్టం విలిఖ్య భూభూయస్తాం ద్విధా కృత్వా తయో

రశ్లిష్టసప్తమా విలిఖ్య పునశ్శ్లిష్టయో శ్లిష్టౌ అశ్లిష్టయో రశ్లిష్టౌ ఇత్యేవం శక్రమేణ త్రయోదశాక్షరఘటితాయాం పంక్తౌ శ్లిష్టాశ్లిష్టాక్షరాణి త్రీణి విలిఖేత్. ఏవం చ కించి దున్న తాశ్లిష్ట పంచాక్షరవిన్యాససంధి రయం బంధః. ఈష దున్నతపర్వపంచకాధారశరాకారవత్త్వాచ్ఛరబంధసంజ్ఞకో భవతి, ఏవం పంక్తిద్వయపంచకలిఖితాష్టాక్షరద్వయపంచకదందురో యం తం తుద్వయప్రోతమౌక్తికద్వయరూపసరద్వయపంచకబంధురత్వా త్సరబంధ ఇత్యేకే సూర్యరాజశౌర్యకీర్తిరమ్య సూర్యరాయభూప సూర్యరాజవర్య మూర్తిసౌమ్యధైర్యభూయభూప ఇతి పదవిభాగః. సూర్యో రాజా చంద్ర స్తత్సదృశే శౌర్యకీర్తిప్రతాపయశసీ తాభ్యాం రమ్యః తస్య సంబుద్ధిః. హే సూర్యరాయభూప సూర్యః రాజా చంద్రః తాభ్యా ముభాభ్యా మపి వర్యః. సూర్యస్య రాత్రౌ చంద్రస్య దివా చ అప్రకాశత్వా దితి భావః. తస్యసంబుద్ధిః మూర్త్యా ఆకారేణ సౌమ్యః తస్మా ద్రాజముఖం భీష్మ మితి శ్రుత్వా సర్వేపి రాజానో భీష్మా ఏవ. అయం తు ఆకారేణ న తథా. కింతు వ్యాపారేణేతి తాత్పర్యం తస్య సంబుద్ధిః. భువం యాంతి ధరంతీతి భూయాః పర్వతాః తేషాం భూపః మేరుః ధైర్యేణ భూయభూపః తత్సదృశ ఇత్యర్థః. తస్య సంబుద్ధిః జయే త్యధ్యాహారః.



## శ క ట బ ం ధ ః

శకటబంధ ముదాహరతి సభేతి. లక్షణం తు షోడశదలపద్మబంధలక్షణ మేవాస్యాపి యోజ్యం వ్యాఖ్యాతం.

## చతురంగబంధః

చతురంగబంధ ముదాహరతి సరసవచనేతి. లక్షణం తు చతురంగ పదన్యస్తే శ్లోకే శ్లోకాంతరం యది ఉద్ధార్యం హయగత్యాతు తత్తు రంగపదం విదుః. సరసవచనమదకలభజయనగవరపరమపరబలహరణ ధనదనదదశవదనమదహరవరమమసగసపదమయపరమదజయసకలసక లభరణ ఇతి పదవిభాగః. సరసాని వచనాని యస్య సః మదకలవ ద్భాతీతి మదకలభః. మదోత్కటో మదకల ఇత్యమరః. పరా ఉత్తమా మాశోభా యస్య సః. పరబలం శత్రుబలం హరతీతి తథోక్తః. ధనే ధనదః కుబేరః. దశవదనో రావణ స్తస్య మదహారో దాశరథిః తస్మా ద్వరో యస్య సః. సరసపదమయోఽయం ప్రబంధః. తత్ర పరోధికో మదోనురాగో యస్య సః. సకలాః పండితా స్తా న్బిభ ర్తీతి సకలభరణః. యద్వా జగద్రక్షక ఇతి వా తేషాం సంబుద్ధయః.

## హయగతిశ్లోకః

హయగతిశ్లోక ముదాహరతి సభచరేతి. సభచరదరధపసయమలధమ రకరహలవవనవనబదనవజరరణదరనరణరకదవమదదభయయరమజ వదపరసమమహసలమశపస ఇతి పదవిభాగః. సభా స్సాలంకారా శ్చరా దూతా యస్య సః భాభువ్యలంకృతా దీప్తా దూతే తు చరో నాజంగమే త్రిష్వితి చ రత్నమాలాయాం. దరో భీతిః తదుక్త్యా ధాచి త్తవృత్తి ర్యేషాం తాన్ పాతీతి తథోక్తః. "దరో స్త్రీ శంఖభ యయోః బుద్ధా స్త్రీధా చ ధిశ్చ ధీ"రితి చ రత్నమాలాయాం.

యను స్సంయమ స్తేన సహితా స్సయామాః సంయమిన ఇత్యర్థః. తాన్ లాతి గృహ్ణాతీతి తథోక్తః. ధస్య కుబేరస్య ఇంద్రస్య వా మా సంపదివ మా సంప ద్యస్య సః. "ధః పుంసిం ద్రే ధ్వనౌ ధ్యానే దేధన్వంతరౌ ఘట" ఇతి రత్నమాలాయాం. రాణాం కుత్సితానాం కాని శిరాంసి రాతి రలయో రభేదేన ఖండయతి హిన స్తీతి యావత్. స తథోక్తః. రవర్ణే పుంసి రేఫ స్స్యా త్కుత్సితే వాచ్యలింగవ దితి రభసః కం శిరోంబునో రితి రుద్రశ్చ హాలేన వాతీతి హాలవో బల రామః. వః కందర్పః తద్వ న్నవ స్సుందరః "వః పుమాన్ సాత్వికే వాయౌ సంయమే వరుణే స్మర" ఇతి రత్నమాలాయాం. చేన వికల్పేన దదాతీతి బద స్స నభనతీతి నబదః. సదా యథా కామార్చితార్థీ త్యర్థః. "బః కుంభే వరుణే బిందౌ వికల్పే చ గురౌ మద" ఇతి రత్నమాలాయాం. నవాని మనోజ్ఞాని జాని భూషణాని యస్య సః "జంకటౌ భూషణే పత్న్యాం తేజ స్యంబుని జన్మ"నీతి రత్నమాలాయాం. ర స్తీవ్ర ఉగ్ర ఇతి యావత్ రణః ప్రతాపో యస్య సః "రేఫ స్స్యా దధమే క్రూరే కృపణే వ్యభిధే యవ"దితి మేదినీదరో భీష్మః. దరో భీష్మః రణే రంభయం యస్య న విద్యతే సనరణరః "రం క్లీబే రుధిరే మూర్ధ్ని ధ్యానవ్యో మాండకుక్షిషు వ క్త్రే భయే చ త్రిషు తు నీరసే త్యాగతీక్ష్ణయో" రితి రత్నమాలాయాం. కం రాజాధిరాజత్వేన మహాదాతృత్వేన వా సుఖం దదాతీతి తథోక్తః. రాజా ప్రకృతిరంజనా దితి స్మరణాతిభావః. వః నామైకదేశగ్రహణా న్నామగ్రహణ మితి న్యాయేన వాసుదేవః తస్య మా శోభా యస్య సః. నావిష్ణుః పృథివీపతి రితి స్మరణా దితి భావః. దదతీతి దదాః దదాతి దధాత్యో ర్విభాషేతి శప్రత్యయః. భో మేఘః సముద్రాదీనా ముపలక్షకః. తేభ్యోపి దాతృభ్యో యచ్ఛతీతి తథోక్తః. "భ శ్శంభౌ భ్రమరే భావే శుక్రేం శౌ జలదే పుమా" నితి రత్నమాలాయాం.

యేన త్యాగేన రమా సంపద్వృద్ధి ర్యస్య సః. త్యాగేన వర్ధతే లక్ష్మీ రితి స్మరణా దితి భావః. "య స్త్యాగే నిలయే వాయూ" ఇతి రత్నమాలాయాం. జవేన దదాతీతి తథోక్తః. సద్యో దదాతి చతుర ఇతి న్యాయా దితి భావః. పగనిరుపమసమాని శోభాయుక్తాని మహాని ఉత్సవా యస్య సః. అత్ర మహాశబ్దో జంతః రజ శ్శిరో నభ స్తపస్స హోమహో మనః పయ స్త్విదం హి శబ్దమండలం. సకారాంతకం మతం తథాపి శబ్దవేదిభి స్త్వకారకాంత ముచ్యతే. రజం శిరం నభం తపంసహం మహం మనం పయ మితి సరస్వతీవిలాసే. నలమం రలయో రభేదేన సరమం రాజ్యశ్రీసహితం శం సుఖం పిబతీతి తథోక్తః. సాః సశయో గభేదేన ప్రభుమంత్రోత్సాహశక్తయః. అస్య సంతీతి తథోక్తః అర్శాదిత్వా దచ్ప్రత్యయః. శాస్త్రీయాం దేవపూజాయాం శక్తౌ చేతి రభసః. తేషాం. సంబుద్ధయః హే వేంకటమహీపతిసూర్యరాయమహారాజ జయే త్యధ్యాహారః.

## ప్రకారాంతరేణ హయగతి శ్లోకః

ప్రకారాంతరణే హయగతిశ్లోక ముదాహరతి. సప మితి. సపశమలసహామమసరపదవజమరయయభదదంఅవదకరణరనరదణరరజననదబనవనవవలహారకరమదలమయసపధరదరచభస ఇతి పదవిభాగః. సం కీర్తిం పాతీతి తథోక్తః. శమాదీన్ లాతీతి శమలః. శమే సర్వం ప్రతిష్ఠితం తస్మా చ్ఛమః పరమం వదంతీతి శ్రుతే రితి భావః. మయా సహితః సహామ శ్రీహరిః తస్మిన్ మా చిత్తవృత్తి ర్యస్య సః. తపసి సర్వం ప్రతిష్ఠితం తస్మా త్తపః పరమం వదంతీతి శ్రుతే రితి భావః. సరపదం జలనిధిః సశయో రభేదః. తస్య వాగ్గర్భా జ్జాయత ఇతి తథోక్తః. వబయో రభేదః. ఉచ్చైశ్శ్రవాః స ఇవ రయేణ యాంతీతి తథోక్తాః.

తాదృశాభావా హా యస్య సః. రాన్ కుత్సితాన్ నరాన్ ద్యతీతి తథోక్తః. దో అవఖండనే ణరా స్సాధవః తేషాం రజననం దుఃఖాపి ర్భావ మేవ ద్యతీతి తథోక్తః. బో మన్మథ ఇవ నవనవః అతిసుందరః యద్వా తస్మా దపి నవనవఇతి వా వబయో రభేదః. వలహారస్య బలారాతేః కరమాబలిసంప దివ కరమా యస్య సః. దళాః దేవరా మయా ఉష్ట్రా యస్య సః. సంవినాయకం పాతీతి సప శ్శివః. తస్య ధరః కైలాసః దర శ్శంఖః తా వివ నిర్మలశ్చ శ్చామరో రాజ శ్చిహ్నం యస్య సః.భస్య రుద్రస్య శేవాజ్ఞా సామర్థ్యం నిగ్రహానుగ్రహరూపం యస్య సః సళయో రభేదః. తేషాం సంబుద్ధిః. హే వేంకటమహీపతి సూర్యారాయమహారాజ దదంకావ్యరచనయా కీర్తిద మిత్యర్థః. మా మి త్యధ్యాహారః అవపాలయ సంభావ యేత్యర్థః. అవధాతో రక్షణ గతి ప్రీత్యాద్యర్థే షూపదేశాత్ ఏవ మన్యేపి ప్రకారాంతరానీత హాయగతిశ్లోకా స్సూక్ష్మమతిభి రనుసంధేయాః.




గవాక్షబంధ ముదాహరతి వేణు మితి. లక్షణం తు ఊర్ధ్వ ముచ్చై ర్లిఖే ద్వీథిం తిర్యగ్వీథిం చ మధ్యతః ఏకైకకోణహానేన లిఖే ద్వీధిచతుష్టయం తిర్యగ్వీథే రథ శ్చోర్ధ్వాం మధ్యే వర్ణ్యస్య నామ చ ఏవం న్యస్తే గవాక్షాఖ్యబంధ మాహురా రథం పరే వేణుం కరవికటకజే నయనే సూర్యం దధః శ్రీశః శ్రీసూర్యధరణిరమణం సరాజ్యవిభవం వయం అవతు నుగతిః ఇతి పదవిభాగః, కరవికటకజేకరవికచపద్మే వికసితపద్మ సదృశహస్త ఇత్యర్థః, వేణుం నయనే నేత్రే సూర్యం చ అత్రాయం విశేషః, నయనే అసూర్య మితి చ పదవిభాగః. అసూర్యం సూర్యభిన్నం చంద్ర మితి యద్వా సూ రేణ సూర్యేణ యుక్త స్సూర్య

శ్చంద్ర ఇతి వా యద్వా సువతి ప్రేరయతి రాత్రౌ వ్యాపారేషు జంతూ నితి సూర్య ఇతి వా తం దధాతీతి దధః దధాతేర్విభాషేతి శప్ప్రత్యయః. నూనాం స్తుతీనాం గతిః సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతీతి స్మరణా దితి భావః. నుశబ్ద స్తు స్తుతౌ స్త్రీ స్యా దితి "రత్నమాలాయాం. శ్రీశ శ్రీపతిః సరాజ్యవిభవం అత ఏవ వం సుఖం యాతీతి తథోక్తం. శ్రీసూర్యధరణీరమణం శ్రీవేంకటమహీపతిసూర్యరాయమహారాజం అవతు పాయాత్. కృతిపతినామోద్ధారానుగుణవర్ణాధిష్ఠితమధ్యవీధికోఽయం గవాక్షబంధః.




చక్రబంధ ముదాహరతి నిత్య మితి. లక్షణం తు బధ్యతే షడరం చక్రం ప్రత్యరం త న్నవాక్షరం త్రయాణా మపి పాదానాం దశమం కర్ణికాక్షరం. ఆదిత స్స్వస్వతు ర్యారై స్త్రయః పాదాశ్చతుర్థగాః వర్ణా షష్ఠాంత్య మారభ్య సంవదం తేతి మాక్షరైః. మధ్యే ద్వౌ ద్వౌ విసంవాదౌ షడరేషు క్రమాద్భవేత్ చతుర్థై స్సప్తమై ర్వర్ణై ర్వర్ణనం కవివర్ణ్యయో రితి నిత్యం సూనృతగుః ధరాధరహారిః జీయాత్. ప్రణయే ప్రజాః సర్వార్యద్రిహారిః సమ స్తరసికప్రౌఢః పరం విశ్రుతః లక్ష్మీరాజితగుః చ సూ త్తరకవిః కీ ర్తిశ్రియా భుః క్షమాం మాంగళ్యం నిఖిలం సమృద్ధలలితౌజాః పూరితః ప్రాప్య మాం ఇతి పదచ్ఛేదః. నిత్యం సర్వకాలసర్వావస్థా స్వపి న తు యదా కదా వా సూనృతా స్సత్యా గావో వాచో యస్య సః. "స్వర్గే వజ్రే చ రశ్మౌ చ బలీవర్దే చ గౌః పుమాన్ స్త్రీ బాణరోహిణీదృగ్దిగ్వాగ్భూమి ష్వప్సు భూమ్ని చేతి త్రికాండ శేషః.

ధరాధరహారీ రాజసింహః "సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థ గోచరా" ఇత్యమరః ప్రణేయా వశంగతాః ప్రజా జనా యస్య సః. "నిత్య మసిచ్ప్రజా మేధయో" రిత్యచ్ప్రత్యయః. సర్వే చ తే అఙ్కు శ్శత్రవ స్త ఏవ అత్రయో గిరయః తేషాం హారి రిన్ద్రః "యమాని వేదరిచన్ద్రార్క విష్ణుసింహాంశువాజిషు శుకాహికపిభేకేషు హరి ర్నాకపిలేత్రి"ష్వితి విశ్వప్రకాశః. సమస్తగసికేషు ప్రౌఢః మహాన్ యద్వా సమస్తై రసికై రసజ్ఞైః పణ్డితై రితి యావత్. ప్రకర్షేణ ఊఢ స్సేవిత ఇతి వా వర మత్యంతం విశ్రుతః ప్రసిద్ధం "ప్రతీతే ప్రథితఖ్యాతవిత్తవిజ్ఞాతవిశ్రుతా" ఇత్యమరః. లక్ష్మ్యా రాజ్యశ్రియా రాజితాగావో దృష్టయో యస్య సః. కిం చేతి చార్థః శోభనాని ఉత్త రాణి ప్రతివాక్యాని యేషాం తే తాదృశాః కవయో యస్య సః. యద్వా సూత్తరా సర్వశ్రేష్ఠాః కవయో యస్య స ఇతి వా కీర్తి శ్రియాభు శ్చన్ద్రః "భు శ్శంభౌధాతరీందానే"తి రత్నమాలా. సమృ ద్ధం లలితం చ జీజో దీప్తి ర్యస్య సః. పూరిత స్సర్వగుణం సంపూర్ణః. ఏవంవిధ శ్రీవేంకటమహీపతి సూర్యరాయ మహారాజః క్షమాం భువం మాం శ్రియం మాంగళ్యం శుభపరంపరాం చ ప్రాప్తజయ్యాత్ జయతు. అత్ర తృతీయవలయే నాను సూరికవిః. అష్టమే వలయే సూర్యరాయవిభు రితి చ కవినాయక నామాంకితో యం చక్రబంధః. నను చతుర్థై స్సప్తమై ర్వర్ణై ర్వర్ణనం కవివర్గ్యయో రితి లక్షణే చతుర్థ సప్తమవలయయోః కవినాయకనామాభిధానస్య విహితత్వా త్కథ మష్టమతృతీయయో స్తత్కథన మితి చేదుచ్యతే. యద్యపి త్వదుక్త ప్రకారేణైవ భవితవ్యం తథా ప్యన్యథాపి కవిసంప్రదాయబాహుళ్యా న్న దోష ఇ త్యవగంతవ్యమ్.